విస్తూవుంటారు. అదేగాక, వల్ల వాళ్ల షాపుల్లో దొరికే సలాంలిస్తున్నట్లూ, వినయసత్కారాలచూపాలే దొరసాన్లకు వాళ్ల వాళ్ల షాపుల్లో దొరకవు. అందువల్ల బజారంతా టాక్సీలూ, మోటారు సైకిళ్లూ, జట్కాలు లోనగువాటితో నిండివుంటుంది. జనసమ్మర్దము మూలాన్ని వీధిలో రావడంపోవడంకూడా కష్టంగా వుంటుంది. ఎలెక్ట్రిక్ గాసు దీపాలు వీధివంతా పగటికంటె మార్పొస్తాయి-అట్టి యీసుందరమైనవీధి మేమెల్ల చూడవతారీఖు సాయంకాల మేడుగంటలవేళ కోకాత్తయుక దయనీ ముఖంలాగు కళావిహీనమైపోయింది. శీతలామందిరాన్ని పోలీసువాళ్లాక్రమించుకోగానే అక్కడనుంచి మరల ముందుకుసాగిన శిక్కుల యూరేగింపు ఈ వీధిగుండానే పోయింది. అందుకు తగిన చిహ్నాలు బాజారంతటా అగపడుతూ వున్నాయి. ఒక్కషాపైనా తెరచిలేదు. రోడ్డుమీద పోలీసువాళ్లుతప్ప ఇంకెవ్వరూ లేరు. కొన్ని షాపులముందు కుప్పతిప్పలుగా పగిలిపడివున్న లిమొనేడ్ సోడాల సీసాలకుప్పలూ, మరికొన్నింటిముందు తల్లక్రిందుగా క్రోయబడి చెల్లాచెదరుగ బడివున్న పగిలిన జార్సెక్కుపెట్టెలూ, లాటైన కాఫీహోటళ్లూ చిటిచిన్నింటిని జూస్తే ఎంతలో ఎంత సుందరమైనవీధికి ఎట్టిపాటు వచ్చిందని దుఃఖం పొంగి వచ్చింది. ఈసందర్భంలో గొప్పగొప్పషాపుల క్షేమానష్టం రాలేదు. వాళ్లు ముందుగానే మేలుకొని తగినఏర్పాట్లు చేసుకొన్నారు. ఎటు వచ్చీ పాడైనవి లిమ్నేడ్ సోడాషాపులూ, తమలపాకుబీడాలదుకాణాలూ, కాఫీహోటళ్లూ, హోటళ్లూ. ఈసమయంలో మరోతమాషా జరిగింది. అసలు తప్పుచేసినవాళ్లు కాలికి బుద్ధిచెబితే పారిపోక నిలుచున్న నిరపరాధులకే పట్టుకోవలసివచ్చేది పోలీసువాళ్లకి. దంగాజరిగే సమయంలో రెండుపక్షాలవాళ్లూ కుక్కలూ పిల్లుల్లాగు తిన్నుకొనేవాళ్లు. ఇంతలో పోలీసువాళ్లు వస్తున్నారని తెలియడంతోనే బయటివాళ్లు పటాపంచలయ్యేవాళ్లు. దుకాణాదార్లు వాళ్ల నౌకర్లూ నిలచిపోయ్యేవాళ్లు. లాటీచెయ్యడానికొచ్చిన బయటివాళ్లంటే పరిగెత్తుతారుగాని అసలు షాపులవాళ్లు ఎలాగూ పరిగెత్తరే! ఫలానిషాపులో దంగా జరుగుతూ ఉందని గుర్తుపెట్టుకొని వచ్చే పోలీసువాళ్లు షాపును సమీపించి అక్కడ పారిపోక నిలుచున్నవాళ్లే పోట్లాడుకొంటూ తామసటికి రాగానే మానేశారని వాళ్లనే అరెస్టుచేసేవాళ్లు. పారిపోయేవాళ్లు వీళ్లకంటికి అగపడరా అంటే అగపడతారు. వాళ్లెవరైందీకూడా తెలుసు. కాని పరిగెత్తినవాళ్లని పట్టుకోవడం వీలౌగాక వాళ్ల వెంటబడి సందుగొందులన్నీ తిరగమంటారా ఏమిటి... సునాయాసంగా పట్టుకోడానికి కావలసినంతమంది ఎదుట నిలబడివుంటే! పోట్లాట అయిన రెండు మూడుగంటలలో జాలరిద్వార అనార్కలీకెళ్లో పోయిచూస్తే నూటికితొంబైమంది షాపులవాళ్లూ, హోటలువాళ్లూ, వాళ్ల నౌకర్లూ, వీళ్లే కనిపించారు. శీతలామందిరంవాళ్లు పట్టుబడిందీ ఇలాగే. బయటివాళ్లు బయట పరిగెత్తితే లోపలివాళ్లు లోపల పట్టుబడ్డారు. వీళ్లందరినీ షుమారు ఎనిమిదిగంటలకు అనార్కలీకైల్లో ప్రవేశంచేయించి, ఒకగంటవరకూ బయటవసారాలో కూర్చుండబెట్టి, తరువాత వీళ్ల తమగదులను ఖాళీ చేసి యిచ్చి అతిథిసత్కారప్రశస్త్యాన్ని నిలుపుకొన్నారు. ఆరాత్రి అక్కడున్నవాళ్లందరూ మందిరంవాళ్లే. ఒకరూ ఇద్దరూ అయితే కష్ట మనిపించేదేమో. నలుగురితో చావు పెండ్లితో సమానం. ఇంతమందిలో కష్టమేమిటి? ఆవేళ కాష్టాలన్నీ మందిరమని భావించుకొన్నారు. కాని మందిరంలోలాగు భోజనం దొరికింది కాదు. విద్యార్థులను మర్నాటి పరీక్షచింత పట్టుకొంది. పాపం, వీళ్లకు సంవత్సరం పాడైందన్నమాటే. ఏమైతేనేం-పన్నెండుగంటలవరకూ గప్పాలుకొట్టుకొంటూ కాలం గడిపి తరువాత అందరూ నిద్రాదేవికి వశులయ్యారు.

మర్నాడు తెల్లవారేసరికి లాహోరు స్థితిగతులు పూర్తిగా మారిపోయినాయి. కడచినరాత్రి జరిగిన భీభత్సకరములైన దౌర్జన్యాలను గూర్చి విస్తారంగా వ్రాయడం అనవసరం. తరువాత ప్రకటితమైన "ప్రతాప" అనే లాహోరులోని ఉర్దూదైనికపత్రిక శీతలామందిరానికి ఎదురుగుండా కార్నీ లాహారీ దర్వాజాలమధ్య ఉన్న గోల్బాగ్ రోడ్డు ఆనాటిరాత్రి ఖైబరుకనుమగా మారిందని వ్రాసింది. దీన్నిబట్టి ఆదౌర్జన్యాల పరిమాణాన్ని కొంచెం ఊహించుకోవచ్చు. జైల్లోకి వెళ్లినవాళ్లే నిర్భయంగా కాలాన్ని వెళ్లబుచ్చారు. మందిరంలో మిగిలిన ఇద్దరు ముగ్గురూ ప్రాణాల్ని అరచేతుల్లో పెట్టుకొని గడిపారు రాత్రి అంతా. ఎప్పుడూ నూరు నూటయాభైమందికి తక్కువ కాకుండా ఉండే ప్రదేశంలో, నాలుసులైవులా మహాగంభీరంగా ఉన్న సమయంలో ఇద్దరు ముగ్గురు దిక్కుదిక్కుమంటూ ఉండాలంటే వాళ్లస్థితి అనుభవించినవాళ్లకే గాని ఇంకొకళ్లకు తెలియదు. తలుపులన్నింటినీ బిగించి, ప్రాణాల్ని భగవంతునికర్పించి కూర్చున్నారు, నిద్రకు తిలాంజలి ఇచ్చి. రాత్రంతా మందిరానికి ఎదురుగుండా రమ్మనలదిగేవాళ్ల ఆక్రందన రోదనాలు చెవులు మూసుకొన్నా వినిపిస్తూనే ఉన్నాయి. ఇళ్లనివదలి బయటికి రానివాళ్లే అదృష్టవంతులు. విధిలేక రావలసి వచ్చిందా, తన్నులు తిన్నారన్నమాటే. తిన్న లేమిటి? ఫైడీలు తెలాఘదెబ్బలతో కేసంతా బద్దలై నెత్తురు కారుతూఉంటే తలదిమ్మెక్కి క్రిందపడిపోయేవాళ్లు. అంత ఆకింద బద్దవాళ్ళని మరినాలుగు తన్నులుతన్ని చెప్పలేకుండా బిగిస్తేవాళ్లు సువాయి. ఈతన్నేవాళ్లూ, తన్నులు తినేవాళ్లూ, హిందువులా తురకలా అంటే ఆ పరమేశ్వరుడికే తెలియాలి. కాని మర్నాడు తెల్లవారంగానే రాత్రి మావాళ్లని హిందువులు చావగొట్టారని తురకలూ, వీళ్లే మావాళ్లని చావదన్నారని హిందువులూ మొరలు పెట్టుకొంటూరు. ఆకాళరాత్రి ఇలాంటి ఘటనాల్లోనే వెళ్లిపోయింది. తెల్లవారింది. చేతులకిమ్మికి పాయ్యేలాగు కావలసినంత పని దొరికిందిగదా అని చాలాసంతోషించారు పోలీసువాళ్లు. నాలుగోతారీఖునాడు లాహోరు నాలుగుమూలలా విజృంభించింది హిందూ మహమ్మదీయుల కొంపమా సంరంభం. పొద్దున్నే లేవగానే వందలకొలది పోలీసువాళ్లు బార్లుకట్టి వెళ్లారు, రాత్రంతా మహోగ్రతతో నగరరక్షణము చేసిన రక్షకభటులను విడిపించడానికి. కేవలం కాపలా నిమిత్తం కొద్దిమంది మాత్రమే జైల్లో నిలచిపోయ్యారు. మందిరం

మంచి వచ్చిన విద్యార్థులు తెల్లవారంగానే లేచి ఎలాగో ఒకలాగు అవసర కృత్యాలను తీర్చుకొని- ముఖ్యంగా పరీక్షకు పోవలసిన వాళ్లు- ఎవళ్లయినా వచ్చి విడిపించుకొని పోతారా దైవమా అని వాకిళ్లకేసి ఎదురుచూస్తూ కూర్చున్నారు. కాని వీళ్ల కోర్కె లేవీ ఫలించాయి కావు. పది గంటలు కొట్టారు పాపం, కొందరి కళ్ల వెంట నీళ్లు కారడం మొదలెట్టాయి. జైల్లోకి రావలసివచ్చిందే అని వీళ్లకు లేశమాత్రమైనా దుఃఖము లేదు. సంవత్సరం పొడుగునా నానా కష్టాలూపడి నిద్రాహారాలు కూడా త్యజించుకొని చేసిన ప్రయత్నమంతా ఒక్కగడియలో బూడిదలో కలిసిపోయిందిగదా అని పట్టరాని దుఃఖము వచ్చింది. కాని ఏంచెయ్యగలరూ! సంద్రాల్లాంటి హేమాహేమీలందరూ ప్రవాహానికి తట్టుకో లేక కొట్టుకొని పోతూవుంటే ఈ క్కల్లాటి విద్యార్థులేం లెక్క? వీరి పరీక్షలేం లెక్క? అక్కడ పరీక్షాభవనంలో హాజరైన విద్యార్థులందరూ సమ్మెకట్టి డెస్కులకు ఎదురుగా లేచి నిలుచొని, పట్నంలో నిన్న జరిగిన ఉపద్రవంవల్ల తమతోటివాళ్లు చాలామంది పోలీసులచేత పట్టుబడి రాలేకపోవడంవలన పరీక్షను మరోదినానికి మార్చమని అధికార్లతో ఎదిరించి మాట్లాడి పేపర్లను రాయడం మానేశారు. కాని హఠాత్తుగా సంభవించినందువలన అప్పుడేలాటి ప్రయత్నం చెయ్యడానికి అధికార్లకు వీల్లేక పోయింది. ఒకవేపు రాయడం మాని విద్యార్థులందరూ నిలుచున్నారు. అక్కడ ఉన్నవాళ్లకు ఏంచెయ్యడానికీ తోచకుండా ఉంది. పరీక్షకు ఆలస్య మైపోతూ ఉంది. ఇంతలో టెలిఫోను ఇచ్చారేమో, రిజిష్ట్రారుగారు ప్రత్యక్షమయ్యారు. వారు ఆరోజున అప్పటికే తక్కిన కేంద్రాల్లో పేపర్లు బయలుపడిపోతాయి కాబట్టి ఆనాటికి మాత్రం తానేమీ చేయజాలననీ, తక్కిన రెండురోజుల పరీక్షనూ పదిహేనో తారీఖు వరకూ మార్పుతాననీ వాళ్లని శాంతింజేసి కూచోబెట్టారు రాయడానికి. అలాగే జరిగింది. కాని లాభం లేకపోయింది. రెండునెల్ల తర్వాత పరీక్షా పరిణామాలు బయటపడ్డప్పుడు పట్టుబడ్డవాళ్లలో చాలామంది తప్పిపోయింది యీనాలుగో పేపర్లోనే. వీరందరికీ రాత్రి శివరాత్రిగానే కడచిపోయినందున మర్నాడు తెల్లవారింది మొదలుకొని కడుపులో ఎలకలు పరిగెత్తడం మొదలెట్టాయి. పదిగంటలయ్యేటప్పటికి పోలీసుసార్జంటు ఇద్దరు ముగ్గురు జవాన్లతో వచ్చి సెనగపప్పు పంచిపెట్టడం మొదలిడితే వాటినే వీళ్లు అమృతోపమానంగా గ్రహించి ఉదరపూజను ఆరంభించారు. రాత్రి మేలుకొన్నంతవరకూ, తెల్లవారిన తర్వాత పోలీసువాళ్లు బయటికి వెళ్లేపర్యంతం వాళ్లీ మందిరమండలిని నిష్ఠుర వాక్యాలతో ఎత్తిపొడుస్తూనే ఉన్నారు. కాని వాటికి వీళ్లు జవాబియ్యక పోవడమే కాక ఆవచన ప్రహారాలవల్ల వీళ్లకు కోపోద్రేకాలు కూడా కలిగాయి కావు. ఇదంతా సార్జంటు కనిపెట్టే వున్నాడు. వీళ్ల మాటలూ వ్యవహారాలూ చూచి వీళ్లనుపట్టి అమాయకులనుకొన్నాడు. కాని మందిరం మీద ఆక్రమణం జరిగేటప్పుడు వీళ్లు ఇటికరాళ్లతో తురకల తలలు ఎగరకొట్టడం జ్ఞాపకానికి రాగా ఇతని కేటూ తోచకపోయ్యేది. చిట్టచివరకు వీళ్లను అమాయకులనే నిశ్చయపరచుకొన్నాడు. సెనగలను పంచిపెట్టేటప్పుడు వీళ్లు మహానందంతో ఎగబడి తీసికొని తినడాన్ని చూచి యీయన తనభావాన్ని బయటపెట్టాడు: ఎంతమందినో ఖైదీలను పట్టుకొని వచ్చాంగాని ఇంతసంతోషంగా సెనగలను గ్రహించిన వాళ్లని యింతవరకూ ఎక్కడా చూడలేదు- అని మెచ్చుకొన్నాడు.

వీళ్లందరూ అనార్కలీ జైల్లో ఉన్నారని మహంతుగారికిగాని, లాహోరు నివాసులకుగాని ఆనాటి మధ్యాహ్నమువరకు తెలిసింది కాదు. నాలుగో తారీఖు ఉదయం వీళ్లు పట్టుబడ్డ సమాచారం పట్నం అంతటా తెలిసిపోయింది. అప్పుడమాల్లో వాళ్లనే కనుంది అనేక స్థలాల్లో ఉన్న జైళ్లకు పోయి విచారించడం మొదలెడితే రెండుఝాములు దాటిన తర్వాత తెలిసింది, మందిరం వాళ్లంతా అనార్కలీ జైల్లో ఉన్నారని. మహంతు పంపిన మనిషి వచ్చి భగీరథ ప్రయత్నాలు చేస్తే మూడుగంటలవేళకు లోపలి కెళ్లి తనవాళ్లని చూడనివ్వవచ్చుననీ, వాళ్లకు కావలసిన తినుబండారాలు తీసుకొచ్చి ఇవ్వొచ్చుననీ ఉత్తరువు దొరికింది. ఆయన లోపలి కెళ్లి వాళ్లందరినీ చూసి ఓదార్చి భోజనాల యేర్పాట్లు చేయడానికి మళ్లీ మందిరానికి వెళ్లాడు. ఏలాగైతేనేం, సాయంకాలమయ్యేసరికి అందరికీ భోజనాలు దొరికాయి. ముఖ్యాధ్యాపకు లక్కడ ఉన్నంతకాలం ఉపవాసం చెయ్యాలనుకొన్నారు కాని చాలా మంది చెప్పిన మీదట రెండోనాటినుంచి పాలు పుచ్చుకున్నారు.

వీళ్లకు మొదటినాడు కొంచెం కష్టం కలిగింది కాని తర్వాత ఇంటికంటే అక్కడే హాయనిపించింది కొంతమందికి. దానికి కారణమేమంటే, నాలుగోతేదీ ఉదయంనుంచి జైలుకు రిక్రూట్లు బాచీలు రావడం మొదలెట్టి ఆరోతారీఖు సాయంకాలంవరకూ వస్తూనేవచ్చాయి. ఈరెండురోజుల్లోనే వీరిసంఖ్య మూడువందలైంది. ఈవచ్చినవాళ్లు మొదటి వాళ్లంతా పైప్రకరణంలో వర్ణించినలాటివాళ్లే. వీళ్లుపట్టుబడ్డవిధానాలు కూడా అవ్వే. వందలకొలది జైల్లో ఉన్నప్పటికీ పట్నంలో అత్యాచారాలు తగ్గాయికావు. బయటజరిగే ఉపద్రవాల్నీ, జైల్లో ఉన్నవాళ్ల వ్యవహారాల్నీ పరకాయించి చూస్తే తోడేళ్లని విచ్చలవిడిగా వదలిపెట్టి గొర్రెలనీ, మేకల్నీ పోగుచేస్తున్నారా అనిపించేది. ఈ తోడేళ్లనే బంధిస్తే ఒక్కరోజులోనే ఉపద్రవాలన్నీ అణగిపొయ్యేవి. కాని ఏం చెయ్యాలి! పోలీసులకు వశమైందికాదు. అదీకాక, ఒక్కరోజులోనే తమాషా అంతా అయిపోతే ఇక తర్వాత మజా ఏముంది! ఈసమాచారాలన్నీ లాహోరులో అందరికీ బాగా అవగతం కావడంతోటే జైల్లోవాళ్లందరూ ధర్మవీరులయ్యారు. వెంటనే సిటీలోని సాహుకా రొకడు జైల్లోవాళ్లకందరికీ రెండుపూటలా భోజనం పంపడానికి నడుముకట్టాడు. ఇతన్నిచూచి మరిఇద్దరుసేట్లు ముందుకొచ్చారు. మంది రాన్నుంచి భోజనంరావడం ఇదివరకే మొదలైంది. పొద్దున్నే పాలు.

పదకొండుగంటలకు భోజనం. రెండు మూడు గంటలప్పుడు ఫలహారాలు. రాత్రి మళ్లీ భోజనం. ఇప్పుడు వీళ్లుండేది జైలా, అత్తగారిల్లా! లాహోరు వాసులు పూర్తుల్లను చేసుకోకుండా ఏర్పడ్డ కొత్తరకపు అల్లుళ్లు వీళ్లు బ్రతుకు. ఈవిపరీతజామాతృగణంలో ఆర్యశ్రీమంతులు మొదలుకొని పని పాటలు చేసుకొనేవాళ్ల పర్యంత మున్నారు. భాగ్యవంతుల ఆకలి మందగించింది. వీళ్లకు స్వకీయులమీద మనసుపోయి అన్నం సయించేది కాదు. కాని యీసంసారపు జంజాటాలన్నీ లేనివాళ్ల ఆకలి ద్విగుణం త్రిగుణమైంది. పైవాళ్లవంతుకూడా ఈకిందివాళ్లే చెల్లిస్తూవచ్చారు. దొరికినన్ని పాళ్లు వద్దనకుండా ఆరగించారు. మొదట మొదట కొంచెం కఠినంగా ఉన్నప్పటికీ క్రొత్తవాళ్లంతా ఖైదీలపక్షం అవలంబించింది. మొదలుకొని పోలీసువాళ్లు కూడా చల్లబడ్డారు. ఏలాగైనా మాట నెగ్గించుకోవాలని పోలీసులు చాలా ప్రయత్నించేశారు. పట్టుకొని వచ్చిన వాళ్లలో కొందరిని అదిరించి బెదిరించి నేరాన్ని ఒప్పించి తమ పక్షం చేసుకోవాలని చాలా ప్రయాసపడ్డారు. కాని కార్యం లేక పోయింది. ఇక బొత్తుగా తూష్ణీంభావం తాలిస్తే పరువుదక్కదేలాగని వీళ్లు కేసుమటుకు దాఖలుచేశారు పట్టుకొచ్చినవాళ్లందరిమీదా. పోలీసువాళ్లీవిధాన్ని తంటాలుపడుతూ ఉన్నా జైల్లోవాళ్ల పనిమాత్రం పెరుగుమీగడలతో గడచిపోతూవచ్చింది. మరికొందు రోజులు దాటిన తర్వాత వీళ్లమీదఉన్న ముసల్మాన్ పహరాకు బదిలీఅయి అస్థలాన్ని హిందూసిక్కు పోలీసు లాక్రమించారు. ఇందువల్ల నూతనజామాతలకు మరికొన్ని అవసరసౌకర్యాలు దొరికాయి. ఇప్పుడు కేవలం స్థలంగాని స్థలంలో ఉన్నామనే చింతేగాని వీళ్ల కేవిధమైన బాధలూ లేవు. యూనివర్సిటీహాల్లో జరిగినసంగతులు తెలియగానే విద్యార్థులు చాలా సంతోషించారు. తప్పకుండా మొత్తం మార్కులు సంపాయించి పాసౌతా మనుకొన్నారు అప్పటికి. కాని పరిణామం పైనరాసినలాగే తేలింది తరువాత. పిదప రెండు రోజుల్లో పోలీసు వేటగాళ్లలో కూడా కొన్నిమార్పులు జరిగాయి. అంతవరకూ గొర్రెలూ మేకలూ మాత్రమే వస్తూఉండేవి దొడ్డికి; వేటగాళ్లలో మార్పులు జరిగిం తర్వాత తోడేళ్లుకూడా రావడం మొదలెట్టాయి. ఇవన్నీ ఇలా ఉండగా, మార్షల్ లా ధొరవారు లాహోరు నొకనెల పర్యంతమూ తమ ఆధీనంలో ఉంచుకోడానికి మక్కువగా ఉందని వారి యభిలాషను వెల్లడించారు. ఈవార్త చెవిని బడేసరికి హిందూ మహమ్మదీయ సంఘాల నడుములు విరిగిపొయ్యాయి. కుంగిపోయి భూమిమీదబడి రోదనంచేయ సాగారు వీళ్లు. అంతపర్యంతం అనుభవించిన ఆనందమే తమప్రారబ్ధంలో ఉందనుకొన్నారు. కృతయుగం పోయి కలికాలం వచ్చిందని భావించారు. సాగ్గు నూటెనిమిది గంటలు గావడంతోటే సర్ మార్షల్ లా ధొరవారు మెషీన్గన్ మోటర్లమీద బహుయాత్రలై విహరించడం మొదలిడేసరికి, పాపం, తోడేళ్లకు ప్రాప్తించినదుర్గతి ఏమని చెప్పాలి! మొగాలైనా పైకి చూపించడానికి వీల్లేకపోయింది. ఈమార్పులన్నింటి మూలాన్ని లాహోరు మళ్లీ కొంచెం కాంతి ముఖానికి తిరగడం ఆరంభించగానే పట్టుబడ్డ వాళ్లని జామీన్లమీద వదలడం మొదలెట్టారు సర్కారువాళ్లు. ఏదో పోలీసువాళ్లు అరెస్టుచేసి కేసుచేశారుగదా, కొంచెమైనా తంతు జరపకుండా వదిలిపెడితే గౌరవంగా ఉండదని, ఫలాని ఫలాని వారు వచ్చి పోలీసుకచేరీలో దర్శన మివ్వమని ఆజ్ఞాపిస్తూ వదిలారు వీళ్లని సర్కారువారు.

మహంతుగారు ఇందు కోసం మొదటినుంచే కనిపెట్టుకొని ఉన్నారు కాబట్టి ఈసమాచారం తెలియగానే దప్పున వచ్చి పన్నెండు వేలరూపాయల జామీను ఇచ్చి తమవాళ్లనందరినీ విడిపించుకొని వచ్చారు.

ఇక వీరికి ద్రవ్యాని కేం తక్కువ, మందిరందక్కింతర్వాత! ఇద్దరు హైకోర్టువకీళ్లని తగిలించేటప్పటికి ఛిన్నభిన్నమై దూదిపింజల్లాగు ఎగిరిపోయింది కేసూగీసూ. అసలు ఇక్కడ కేసేమిటి? ఇదీ ఒక తమాషాగామా? అన్నదమ్ములబంతులాట. ఈసమయాన్ని పైగంబరు భక్తుడొకడు గుళ్లోనించి రాళ్లు వేసినవాళ్లని సరిస్తానని బయల్దేరాడు. అంత ఈకేసుకు సంబంధించిన వాళ్లయితేనేం, సంబంధించని వాళ్లయితేనేం, మూడువందలమంది కట్టగట్టుకొని వెళ్లారు ఐడెంటిఫికేషన్ నిమిత్తం. వరుసలు దీరి ఈమూడువందలమందీ నిలుచుంటే అసురించే పెద్ద మనిషి వచ్చి వీరిందంతా కేసుకు సంబంధించని వాళ్లనే. కేసు వెంటనే కొట్టేశారు. మహంతులవారికి అపరిమితానందమైంది. ఇప్పుడు వారి దగ్గరికి ఎవరైనా వెళ్లారంటే దుర్గాదేవే తురకల ఆక్రమణాన్ని తప్పించిందనీ, కేసులో గెల్పించిందనీ నవ్వుతూ సెలవిస్తూఉంటారు; సందేహ ముండదు. కాని ఆవాదు విద్యార్థులమూలాన్ని శీతలామందిరం నిలిచిందని లాహోరువాళ్లంతా అంటారు.

---




౧

మందమలయానిలంబులు మలయుచుండ-నిన్న మాపట నాప్రశాంతిమయ గగన
తటినియందున శశికళా తరణి నెక్కి-చెలిమికాంద్రతో గానంబు సేసికొనుచుఁ
బోయియున్నది నీవు కావోయి సఖుఁడ! -అదిగొ! నిన్నటిరాత్రి మేఘాశ్వ మెక్కి-
తారకాగణోద్యాన రథ్యలను స్వారి-చేయుచున్నది నీవు కావోయి సఖుఁడ!

మొన్న పున్నమనిసయందుఁ బొడుపుఁగొండ-శిఖరమునఁ గూరుచుండి రసికత వెలయఁ
బశ్చిమాశాంగనామణిపైని మల్లె-చెండు విసరిన దీవెకా! చెలిమికాఁడ!
పాఱఁజూచితిఁ గనుమాపుమేర నుండి-ఈమహాకాంతి మెచ్చుటి దెవరు లేరె!

౨

ఆకసంబునఁ జంద్రుఁడా, యుత్తమించె-దారకాబృందమా, వారిదముల దాఁగె
నీమహాకాంతి మెచ్చటి? యెంతమధుర - మెంత హృదయంగమంబయి యింపు నింపుఁ
దావకీనతనూవల్లికావిలాస-పూరమా? కాక త్వత్కృపా క్షీరసింధు
ధవళభంగములా? లేక తావకమగు - సరసరమణీయ మందహాసంబా? లేద!

3

శాద్వలమునకు సాయాహ్న సమయమందు - నేఁగుదెంతువు నీ వని యెప్పటివలెఁ
బోయి కూర్చుండితిని ప్రొద్దుపోవుదాఁక - నీవు రాలేని కారణం బేమొ? సఖుఁడ!

వేగుఁజోకల వాహ్యాళి కేఁగునపుడు - నాదుగదివద్ద కరుదెంచి నన్నుఁ బిలుతు
వనుచు నీకయి వేచియుంటిని చిరంబు - నీవు రాలేద కారణం బేమొ? సఖుఁడ!

వచ్చి భోజనవేళకుఁ బ్రక్కఁ గూరుచుండి ముచ్చటలాడుదు నందు వనుచుఁ
గాచుకొనియుంటి నే నొంటిగంటదాఁక - నీవు రాలేదు కారణం బేమొ? సఖుఁడ!

౪

శాంతిపాలిత మానంద కాంతి దీప్త - మయిన మానుకిహృదయు సౌధాంతరమున
రేయుఁ బవలును సంధ్యలఁ బ్రీతిగదుర - సఖుఁడ! నీతో వసింప నిష్టంబు గలదు.

త్వద్విమానంబు నాదు సౌధంబుపైకిఁ - బట్టుమోయీ! సమర్పింతు స్వాగతంబు
నచలితానందమయహృదయంబుతోడ - బాష్పజలపూర్ణ నేత్ర కుంభములతోడ.

౫

ఓ అయస్కాంతమా! సుః శ్లోక్యరంబు - మణిసముచ్చయనుంచిన గణనఁగొనవు
నాయయఃఖండమందు నవశ్వరమగు - ప్రేమ నీకెట్లు గలిగె వర్ణింపఁజాల.

ఓయి! వైణిక వాంశిక గాయకాళి - నూపి తమతమ సంగీత నైపుణంబు
నిన్ను నానందపఱచుచు నున్న నేల - నాదుకూనరాగము వీను నాదరంబు?

ఓ మహారాజ! రజితసముజ్జ్వలములుఁ - గాంచనములగు పాత్రముల్ కలిగియున్న
నాదు మట్టిగలంతియుదిగాఁదమాత్ర - మేల యవ్యాజకృప గల్గె? మెఱుఁగఁజాల.

౬

అలలు కాలసర్పము పడగలవిభాతిఁ - బైకి నాల్కలు ద్రోయుచు వచ్చుచుండె;
యమునిసైనికసంతోహ మనఁ దిమింగిలాది జంతువుల్ తట్టుముట్టాడుచుండెఁ;

గుటిలమృత్యుదేవత కంఠ కుహరము లన - నెసఁగు నావర్తములు వివరించి యుండె
జవ్వనను బలివేయు కసాయి యొకఁడు - వాఁడిక త్రిత్రోఁ బైనుండి వచ్చుచుండె

ఓయి యమృతశకుంతమా! యొక్కమారు - వెలయు నపరంజిరెక్కలు విప్పి వచ్చి
పైని వ్రాలి నీకాళులలోన నన్ను - గ్రుచ్చుకొనిపోయి కాపాడఁ గోరినాఁడ.

౭

నిన్ను ముద్దాడుచున్నట్లు నిశ్చయించి - నాకుమారుని ముఖచుంబనంబు సేతు;
నిన్నుఁ గౌఁగిలిగొనునట్లు నిశ్చయించి - నాప్రియాలింగనంబు నొనర్తు దేవ!

౮

నాయికానాయకప్రతినాయకులయుఁ - దొడరి చేటికారాతవిదూషకులయు
భూమికల నీ వొకండవ పూని పూర్ణ-నాటకముఁ జ్రత మాడుచున్నావు దేవ!

౯

నేరుకన్నులతోఁ గనిపెట్టుచుంటి - నెపుడు తప్పించుకొనుచుఁ బోయెదవొ నాదు
వ్రజపుం గోటనుండియు బయలి కనుచు?-నెటులొ నేత్రోవ వెలికిఁ బోయితివొ? దేవ!

౧౦

గుడి కట్టించి యమూర్తిమంతుఁడగు నీకున్ మూర్తిఁ గల్పించి యే
ర్పడ నోదేవ! పసిండిదువ్వలువలం బైఁ గప్పి పూదండలన్
మెడలో వైచి సహస్రనామములతో నిన్నుం బ్రశంసించుచుం
గడుబత్తిం గుసుమంబులన్ దళములన్ గావించెదన్ బూజలన్.

౧౧

కడుఁబాగమారి నల్లఁబడి కాంతి యడంగిన గాజుగొట్టమున్
గడిగియు నీటితో విమలకాంతియుతంబుగఁ జేసియున్న న
న్నడె మసిబాతి నల్లఁబడిపోవుచు దివ్వెవెలుంగుఁ దగ్గఁ జే
సెదు; నిది స్నేహదోషమున చేసితొ? యె ట్లిఁకఁ గాంతు వస్తువున్?

౧౨

ప్రాహ్ణ సాయాహ్నవేళలఁ బ్రత్యహంబు - నేస్తులం జూడఁబోయెదు నీదుదారి
మధ్యనున్నది యో ప్రభూ! మద్గృహంబు-కాన దయసేయఁగా దప్పు గాదు నీకు.

౧౩

తరుల చిగురాకు కదలికం దోలఁ గాంచి - వాని చల్లని నీడఁ బూఁబొనుపుపయి
శాంతముగ నీవు పండ నిశ్శబ్దముగను - నాకుఁ దెలుపుచున్న చందమున భ్రమసి
గట్టులను బుట్టలను దాటి కాల్వ లీఁది - పోయి కని యూరకమునఁ దెల్లఁబోయినాఁడ.

౧౪

నీమహాసౌధపుర ద్వారభూమికడకు - వచ్చి గొంతెత్తి పిలిచితిఁ బలుతడవలు
'ఓ' యనెడుమాట వినఁబడ దొక్కటియును - ఉంటివో లేదొ తెలియరా దింట నీవు.

౧౫

నడిరేయయ్యెఁ బ్రగాఢనిద్రఁగొనియున్నా రింటివారెల్ల రి
ప్పుడు శాంతించెను వ్యతిమర్మరరవంబుల్ ఝిల్లికారావముల్
తడవుం జేయక రమ్ము! మిత్రమణి! మత్స్నేహంబుపైఁ జేరి హె
చ్చెడు మోదమ్మున సల్పు కొంద మనమక్షీణంబుగా మిత్రమా.

౧౬

వినియు నాజీవితగ్రంథమును బుధేంద్ర! - కోపముల్ సవరించి తద్గుణలవంబుఁ
బెంపొనర్చి రసస్ఫూర్తి వెలయఁజేయు - మంకితమొనర్తు నీకు సత్యాదరమున.

౧౭

ఆకాశం బది వంచి శీర్షము నమస్యం జేయు; భూదేవి యా
శాకాండంపుఁ గరంబు లెత్తి మనవిం జల్పుఁ; గిరిశ్రేణి దం
డాకారంబుగ వ్రాలి మ్రొక్కెడు; సమస్తార్థుల్ భవత్ప్రార్థనా
శ్లోకౌఘంబు జగత్ప్రభూ! తగఁ బఠించుం బ్రోచ్చకంఠంబులన్.

౧౮

పూవులుం బండులుంగల తీవెలగమిఁ - జుట్టుకొన్న పూఁజవికె మేల్కట్టుక్రిందఁ
బఱచియుంటిని రత్నకంబళి మొకండు; - విశ్రమింపుము విచ్చేసి వేగ దేవ!

అల తరంగడోలికల నుయ్యాలలూఁగు - రాజహంసలు శితపత్త్రి రాజియుఁ గం
మానసరోవరమం దొకమంటపంబుఁ - గట్టితిమి యధిష్ఠింపు మక్కడను దేవ!

౧౯

సెలయేఱులార! మీ సలలితసలిలంబు - భక్తియుక్తంబుగాఁ బాద్య మిందు!
లతలార! మీ మృదులమ్ములైన పుష్పమంజరుల నర్ఘ్యంబు లొసంగుఁడమ్మ!
తరులార! మీదివ్యతరఫలబృంద మాహార మర్పింపుఁ డాప్యాయనముగ!
పతగంబులార! మీ స్వాదువాక్కులతోడ - క్షేమవార్తలను బ్రశ్నింపుఁడయ్య!
ఆజగత్ప్రభుఁ డీదినం బతిథియగుచు - నాకుటీరంబునకు వచ్చు నను దరింప
హర్షసమ్మోదచిత్తుండ నై తెలియక - అతనికి నపచారంబు సేతునేమొ?

౨౦

ఎచ్చటెచ్చటనో దేవ! మెఱుఁగకుండ - దాఁచియున్నావు నా పదార్థముల నెల్లఁ
బెద్దకాలంబునుండియు వెదకివెదకి - విసుగు పుట్టెను గాని కాన్పింప దొకటి.



శ్రీ రామసేవా దళోద్యమము, నిజాంరాష్ట్రము



శ్రీ వనమాల నారాయణదాసుగారు



శ్రీ దావత జనార్దనవ్యాసుగారు

౨౧

నాదుదీపంబు తైలశూన్యమని కాని - కాలపరిమాణ మింతని కాని తెలియ;
దాని నిర్వాణకాలంబు దగ్గఱించి-నట్టు లున్నది మినుమినుక్కు లాడుచుండె:
నావిధుల నొక్కఁడేని నొవర్పలేదు - ప్రభువు కేమని ప్రత్యుత్తరంబు నిత్తు?

౨౨

నిదుర మేల్కాంచి మున్నున్న నెలవుఁ దప్పి-కలుషభూయిష్ఠము భయానకము జుగుప్సి
తంబు నగు నొక్కయంధకూపంబునందుఁ-బడి యునికిఁ గంటి; సత్యమో, స్వప్న మొక్కొ!

౨౩

గగననైల్యంబు, శశికళంకంబు, వార్ధి - లవణభావంబు, హాలాహలంబు చేఁదు,
మాదు హృదయమాలిన్యంబు మాయ దెట్లు?-మాపుదివ్యౌషధి నొసంగుమామహాత్మ!

౨౪

ఏతీర్థంబులఁ గ్రుంకులాడితినొ! ము న్నేవేల్పుఁ బూజించి సం
ప్రీతుం జేసి వరంబులం గొనితినో! వేదంబులన్ నాల్గిటిన్
వేమారుల్ పఠియించినానొ! నరయోనిం జన్మముం బొందఁగన్
భూతవ్రాతమునన్ శుభేంద్రియగణంబుం బొంది శోభిల్లఁగన్.

ఉత్తరకాలమం దిటులె యుత్తమజన్మముఁ బొందఁజేయనే
నత్తప, మెట్టిహీనమగు జన్మము కల్గునొ యింక నాకు సం
చిత్తలపాటుతో హృదయ మూఱటఁ గాంచక కూరుచుండె వె
ఱ్ఱెత్తినరీతి నేడ్తు జను లెల్లరు నర్థము గాక చూడఁగన్.

౨౫

అతటంబులైన నాజీ-వితగతదుఃఖప్రవాహ వితతుల తత్త
ద్గతు లెన్నని వినిపింతును?-నితాంతమును విసువు పుట్ట నీకును దేవా!

---

# మఱ్ఱిచెట్టు

శ్రీ త్రిపల్లి సూర్యరావు గారు

సీసమాలిక

జయ వృక్షమూర్ధన్య జయ వట విజయాభవ
మహోన్నత విశాల వర్ణనీయ!
సుగుణాఢ్య నిన్ జూడఁ జోద్య మౌ నే మని
నుతియింపఁ దగునో నామతికిఁ దోఁప
దైన నొక్కింత నాయుండలితలఁపులు
వెలిపుచ్చెదను విను వీను లొగ్గి
నిన్నుఁ గాంచినఁ దపోనియతులమోడ్కి౦ గా
న్పింతువు మిసమోడ్కి నిల్చియుంట
జడలు దాల్చుట నెండ జడి సీతు నోర్చుట
ప్రాప్పడియుండుట మహిని బాద
మూనియు నూనకయుండుట శిఖలలోఁ
బక్షులు గూండ్లిడి వసతి చేసి
కొనియున్న మిన్నకయునికినిఁ; బుసుభో త్త
మునిభంగిఁ గాంచెద నిను నొకతతి



బహుశీర్షముల బహుపాదమ్ములను బహుకోటరాక్షులు గల్గి కుశలఖతల
సంవ్యాప్తి నొప్పిన సకలజంతుశ్రేణిఁ దరులతాగుల్మాది దాల్పఁ జూచి;
యాదిమూలము గాన కంతంబు లేదు నీ కని విష్ణురూపుగా ననుకొనియెద
తులసిపోలికి నీవు వెలసితి సర్వతీర్థసమృద్ధి మూలతీర్థకరుఁ డైన
పరమేశ్వరుఁడు నీదు ప్రకటమూలంబున వసియించి జ్ఞానసంపన్నులుగను
మౌనులఁ జదివించి మంతు కెక్కించుట బోధిద్రుమం బను పూత నామ
మును నీవ తొల్లఁగాఁ జను రావి కెట్లబ్బె బోధమూర్తి యగు నా బుద్ధదేవుఁ
డును నీదుమూలంబున నె కదా పేర్గాంచె రావి యెట్లో వృక్షరాజ మయ్యె
నక్షయవటసమాఖ్యయె చాలు నీ గౌరవంబున కెందఱు పాంథు లెపుడు
నీనీడ బ్రదికెదరో నేను జెప్పఁగావలయునా; గోపకావలిని గూడి
యుండ గోవులు నీదు నుత్తమచ్ఛాయను భాండీరవటము నా భావమందుఁ
బాడకట్టుచున్నదీ; భూమిపైఁ దారాపథంబు వ్రాలకయుండఁ ద్వచ్ఛిరోగ్ర
మున మహాబిలముగా నొనరించి బోటొగ్గువడువునఁ బెరిఁగెదు పాదవుగాను
దిక్కులు సంకోచదృష్టిఁ జేరకయుండఁ దతము గాంతువు దిగ్వితానములకు
భూతసంతతికి నీవే తావుగా నుందు పర్ణశాలవు వనవాసులకును
సుమనోభిరామ లౌచును లతాలలితాంగు లెపుడుఁ బైఁ బ్రాఁకఁగా భృంగగీతి
కలు శుకశారికాపికలసదాలాపము ల్వెలయ శృంగారంబు లలవరింతు

వెజ్జుకైవడి బహువిధవైద్యసామగ్రి నీ వొసంగెద వూడ యిగురు పాలు
పట్ట వేర్లండ్లును బత్తమ్ము లిట్టి యుత్తముఁడవు నుపకారతత్పరుఁడవు
ఉత్తరంబున గయ నున్నావు దక్షిణమధురలో నున్నావు మఱియుఁ దూర్పు
నను [1]దత్తరాజేరునను బడమర [2]బ్రహ్మపురమున [3]దుప్పలపూఁడిలోన
నున్నాఁడ వింతటి యుద్ధతుఁడవు నీవు నీపొడ యద్భుతరూప మయ్యెఁ
జీవకలను బోలు చిన్నబీజమునుండి వెడలితి వెల్లెల్లొ పెరిఁగి పెరిఁగి
యింతవాఁడవు నేటి కింతవాఁడవు గాఁగ మెలమెల్లగా వచ్చి మేటివైతి
వెక్కడఁ బకనైన నక్కడఁ బాఁతుకొందువు గాన నతియుండవు నిజంబు
వలపు లెచ్చట నుండు వాపు లచ్చట నుండు నెందుఁ బ్రేమ దా నందు లేదు
సమవరోహారూపవిచార మందురు "నిట్టతాడు శాఖాహీనుఁ దవిలి కౌఁగి
లించికొందువు విడలే"[4] వతంతో నీవొ యంతంబు గనుదాఁక సహరహంబు
నిక్కంపుఁ గామినినిం గాఁగ నెంతు నీ స్నేరీతి చర్యలనెల్లఁ జూచి
చేవ నీలో లేదు స్నేహగుణము కానరాదు నీమేను వ్యర్థ మను జగము.
నీ న్నాశ్రయించిన నిఖలభూతంబులఁ గాపాడెదవు కోఁతిగాండ్రఁ బెంతు
మొక్కమోటిక నీడ మొలిచిన నేమన వేటికో నీబిడ్డ నింతదానిఁ[5]
బొదలనీయవు దాని పొడ నీకుఁ గిట్టదా మామిడిక్రింది పోమరులు లేరె
శిశిరర్తువున మున్నుఁ జేసిన దుష్కృతంబులను గాఱాకులపోల్కి దుల్చి
నిష్కళంకాకృతి నెగడెద వేఁటేఁట నవచి చిగిర్చి విన్నాణముగను
నీ న్నంతఁ గాంచిన నే నెంతుఁ బతిక విషదగ్ధమైనంత విప్రవరుని
మంత్రప్రభావత మరలఁ బొంపిరివోవునట్టి యానాఁటి నీ యందమెల్ల
నీ యాకుకంటె నెన్నియొ రెట్లు పెద్దయాకులు లేవె వెదుకఁ దేకు మొదలైన
చెట్టుల, నీయందు స్నిగ్ధత గలదు నీ సుగుణంబులట్ల యాచొప్పఁ బట్టి
వెదకి యక్కాలమున విష్ణుదేవుఁడు నీదు మృదులపర్ణంబున మిసిమిదేఱు
కలశవారాన్నిధిఁ గరువలి తిండి పాన్పునకంటె మిక్కిలి భోగలీల
నుండు; నీయాకుల నొప్పు విస్తరి వెండిపళ్లెరమును మించి స్వచ్ఛముగను
నుండినఁ బిత్రుతిథి నుజ్జగించుట కాశి కేఁగివచ్చినవార లెల్ల విడుట
నీదు పైఁజెప్పిన నిర్మలభావమ్ములనుబట్టి యెంగిలి చనదు చేయ
నని కాని లోచ్చని యారసి కా దనుకొందును, న్యగ్రోధకుజము, సేవ్య
మునకు నీ విచ్చెద వనువుగఁ గాఁడి, బండికిఁ దొల్పుఁ గమ్మి బోటికిని లిద్దె
బోటిని మంచపుఁగోటిని బట్టలఁ గోడుగుఁగామను వీథిగుమ్మమునకు
బురదకమ్మిని విప్రపుంగవులకు నీవు కల్పకంబువు గాఁగఁ గానఁబడెదు
శేలాళముల కుపమాతవు బ్రహ్మచారుల కనధ్యయన దాతల నొకఁడవు

1. విశాఖపట్టణము జిల్లాలో. 2. ఏవామ పరిసరమున. 3. ఆమహత్తి స్థలమునఁ దాపున నక్కడఁ జెద్దవట్టులు పేరుఁడినవి గలవు. దుప్పలపూఁడి మఱ్ఱి, బ్రహ్మపురి మఱ్ఱి యని చెప్పికొందురు; మాడఁజోదురు. 4. ఎరుటిపుటలోని బొమ్మను చూచునది. 5. మఱ్ఱిచెట్టుక్రింద మఱ్ఱిమొక్క దొరక దనియు, దొరకిన నదియే గొప్పవైద్యములో నుపయోగించుదురనియుఁ జెప్పుదురు.

నిన్నుఁ జూచిన మహాసీయులకును నీదు నీడ సద్గోష్ఠిని నెఱప మనసు
పుట్టు; నీఛాయను బోధింత్రతు బాలురకును బడియొజ్జలు కుటశిరోమ
ణీ! నిన్నుఁ గాంచిన నానంద మగు సర్వజీవులకును బాడఁ, జేరి యాడ,
వేఁడ దేవుని, గుంపు గూడ నేపనికిని సజ్జనులను గాంచి సలుపఁ బోడము
సజ్జనకును నొక్కఁయుప్పుడు గాకున్న నొక్కయపుడు మంచియూహ; త్వాద్ర
శులును సన్మార్గదర్శులు చెట్లు పుట్టలు శిలలు మృగంబులుఁ జిత్తశుద్ధి
కారణంబులు గావె కలికాలమున మతభేదమానసులకు విశ్వదృష్టి
నొదవును వేదాంత మెుక్కప్పు డీశ్వరు నుతియింపఁ దన యపకృతులఁ దెగడి
కొనఁగ జగము గురువు కొందఱ కారీతి - నిన్ను గురువుగాఁగఁ గొన్న నెఱుఁగ
వచ్చు దైవమహిమ వ్యవహారరీతులు - సరసరంజనంబుఁ జలుపవచ్చు.

---

## భిక్షాందేహి

గుండిమెడ వేంకటసుబ్బారావు గారు

ధనికులార! నిర్భాగ్యసత్కవుల మేము
వచ్చితిమి బిచ్చ మడుగ మీద్వారములకు!
ఇచ్చి సెల వీయుఁడయ్య! లేదేని త్రిభువ
నావనుం డైన జగదీశుఁ డాగ్రహించు!

వలదు మాకు కుటుంబపరిపోషణార్థ మ
క్షయము లౌ ధనధాన్యసంచయములు
వలదు మా కిచ్ఛానివాసంబునకు నూత్న
మణిమయాభోగరాణ్మందిరములు
వలదు మాకు శరీరపరిరక్షణము నిమి
త్తం బమూల్యములు రత్నాంబరములు
వలదు మాకు వినూత్నకళల నాపాదింప
పొలుపారు సౌవర్ణభూషణములు
వలదు మా కిట్టి దుర్భిక్ష వలదు, వలదు;
తగవు మా కివి, పడవు మాతత్వములకు;
కవుల మేము, దారిద్ర్యలోకంబునందు
సౌఖ్యమును బొందెడు విచిత్రజాతి మాది!

సదమలానంద నవసుధాసారనిభుల
గర్భములఁ దాల్చు నీలమేఘముల మేము!
మీ కృపాదృష్టి యను గాలి సోఁకెనేని
కుఱియుదుము ధాత్రిపై సుధాకుంభవృష్టి!

ఆత్మసుఖముఁ గోరి యర్థింప మేవేళ
లోకసుఖమె సుకవి లోక సుఖము
మా కొసర్చు మేలు లోకం బనుభవించు
వలయు బిచ్చ మిచ్చి పంపరయ్య!

సుకవీంద్ర సహవాస సుఖముఁ బొందనివాని
ధన మేల? వాని యార్జన మదేల?
కవిరాజ సన్మాన గణుతిఁ గాంచనివాని
ధన మేల? వాని యార్జన మదేల?
కవిచంద్రచంద్రికా కలన మబ్బనివాని
ధన మేల? వాని యార్జన మదేల?
కవిరక్షణోద్యోగకాంక్ష కల్గనివాని
ధన మేల వాని యార్జన మదేల?
ఆదరామృత బిందు భిక్షార్థు లగుచు
పంచఁ జేరి సత్కవులు ప్రార్థించుచున్న
కంటఁ జూడని పాపిష్ఠఘాతుకాత్ము
ధన మదేల? యార్జన మేల? తను వదేల?

సత్కవుల దుఃఖపెట్టంగఁ జనదు మీకు
వారి వేఁడినిట్టూరుపుల్ భవదనంత
వంశనాశంకరోద్భూత ప్రళయ దహన
దారుణజ్వాల లగుఁ జుడీ ధనికులార!!

# *బుక్కరాయని విద్యానగరము—నాఁటి యన్యదేశ పరిస్థితులు

సిరిపి ఆంజనేయులుగారు,

1. బుక్కరాయఁడు రాజ్యారూఢుఁ డగుట.

హరిహరుని పిమ్మట నాతని తమ్ముఁడగు బుక్కరాయఁడు క్రీ. శ. ౧౩౫౧ వ సంవత్సరమున విద్యానగర సింహాసన మధిష్ఠించెను.

> సామ్రాజ్యలక్ష్మీం అధిగమ్య తస్మాత్
> శ్రీబుక్కరాజో విజయార్జితశ్రీః;
> యో భూతభావిక్షితిపాలజాలం
> అత్యక్రమీత్ విక్రమవైభవాభ్యామ్.

> సర్వోత్కర్షఫలో త్తరా వసుమతీ నిష్కంటకో త్తంటకా
> నిశ్శేషీకృతవైరిభిర్ అమితో ఽవక్ర విక్రమస్థితౌ;
> జాతప్రీతజనోత్సవో జనపద స్సంపత్సమృద్ధా సదా
> యస్మిన్ బుక్కమహీపతౌ సముభవత్ విశ్వంభరారక్షకే.

*     *     *     *

> యత్తుంగభద్రాంచిత పాదపీఠం
> భద్రాసనం భాసుర హేమకూటం;
> క్షోణీజనానాం పరిరక్షణార్థం
> తస్మిన్ విరూపాక్ష ఇవాన్వతిష్ఠత్.

—ఎపిగ్రాఫియా కర్ణాటికా, సంపు. వి. సం. ౨౫౬, పుట ౫౩౦.

నాఁటి విద్యానగర వైభవమునుగూర్చి కుమారధూర్జటి చక్కఁగ నభివర్ణించెను. అందుండి రెండు పద్యములు—

> సీ. శ్రీరమారమణ విహార హారిగృహంబు
> బహుళోర్ధ్వనాన్విత ప్రత్యహంబు
> సతత పౌరజనాచరిత విస్తృతమహంబు
> దుర్వారవరతురంగ ధూర్వహంబు
> శ్రితమహారత్నను గంధ సహిత గంధవహంబు
> దీపితారాతి గర్వాపహంబు
> నాయికానాయకోన్నత రహఃకలహంబు
> సర్వవస్తువ్రాత సంగ్రహంబు
> మహిని రహిమీఱు నౌర పంపానదీత
> రంగసంఘ ఘుమంఘుమా రవ విఘూర్ణ
> జాహ్నవీనిమ్నగా సుధా సాగరంబు
> విజయనగరంబు కుజనవసంవిత్కరంబు.

> సీ. మధురసాధిక సుధా మధురసాలోల్లస
> న్మధురసావల్లరీ మహిమతోడ
> సురసాలతుల్య భాసురసాలవనమధ్య
> సురసాలజంబీరతరులతోడఁ
> పున్నాగ హితమాన పున్నాగసంచర
> త్పున్నాగ కైతవ స్ఫురణతోడ
> బాలికారమణీయ పాలికాసన మధు
> పాలికాసార సంపదలతోడ

---

* నే నీవ్యాసమున బుక్కరాయని విద్యానగరమును గూర్చిమాత్రమే వర్ణింపఁబూనక, రాయని సామ్రాజ్యమును, పరిపాలనాదికములను గురించి సంక్షేపముగఁ దెల్పుచు, నాఁటియన్యదేశపరిస్థితులఁ గొంతవఱకు సూచించినాఁడను. వాని నొండొంటితోఁ బోల్చిచూచుట పాఠకులధర్మమయి యున్నది. పదునాల్గవ శతాబ్దమునందలి ప్రపంచచరిత్ర మొక్కమాఱు విలోకించి, నాఁటి విద్యానగర సామ్రాజ్యపరిస్థితుల నింకను గాఢముగఁ బరిశీలించుచో, నాకాలపు ప్రపంచచరిత్రమున విద్యానగరమున కట్టిస్థాన మీయఁ దగియుండునో యది చరిత్రగ్రాహకులకు సుబోధము కాఁగలదు. ప్రౌఢదేవరాయనియు, కృష్ణదేవరాయనియు, రామరాజయొక్కయు పరిపాలనమున విద్యానగర సామ్రాజ్య మత్యున్నతదశలో నుండినది; గాన నప్పటి రాజ్యాంగవిషయముల నన్యదేశపరిస్థితులతోఁ బోల్చిచూచిన, మిగుల స్వారస్యముగ నుండునో పు. ఈవ్యాసరచనమున 1. Bellary District Gazetteers, 2. The Never to be Forgotten Empire, 3. Humpi Ruins, 4. An Advanced History of Great Britain, Book III by T. F. Tout, 5. History of Europe 6. వీరేశలింగము పంతులుగారి యాంధ్రకవుల చరిత్రము, 7. మహమ్మదీయమహాయుగము-అను గ్రంథము లేదును సాధనములుగ నుండి నాకుఁ దోడ్పడినవి; కనుక నీగ్రంథకర్తలయెడ నేను గడుఁ గృతజ్ఞుఁడను. సీ. ఆ.

లనంతపురమండలమునందలి నుత్తి పెనుగొండ భాగములకు సంబంధించిన వగుటచే, నీకవి నెల్లూరి మండలమునకుఁ జెందినవాఁ డనుటకంటె ననంతపురమండలవాస్తవ్యుఁడుగ నుండునని యూహించుట కెక్కుడు వీలున్నది. బుక్కరాయఁడు నుత్తిప్రాంతమునం గల 'పెంచుకలదిన్న' యను గ్రామమునకు 'బుక్కరాయపురము' అని పేరుపెట్టి, దాని నీకవికిని, మఱికొందఱు బ్రాహ్మణులకును నొసంగినట్లు పైదాన శాసనము నుడువుచున్నది.

"నుత్తి దుర్గాభిధే రాజ్యే కోనూరాఖ్య మహీతలే,
పెన్నమాగాణివిఖ్యాతే సర్వసస్యసశోభితే. ౨౩
కోనూరు నాగసల్లాఖ్య దిన్నాభ్యా మపి పశ్చిమం,
గ్రామోత్తమా ద్వేరు వంకూరోః ప్రాచ్యాద్దిశి సమన్వితం.
ఈరచింతల నామ్నశ్చ గ్రామా ద్దక్షిణ సంస్థితం,
వంకలూరోఽకుడు తాళాభ్యా ముత్తరాశా మపాశ్రితం. ౨౪
పినాకినీతటే పెంచుకలదిన్నాహ్వయం పురా,
బుక్కరాయపురాఖ్యాత్ప్రతినామ్నా చ శోభితం. ౨౫
నిధినిక్షేప సంయుక్తం జలపాషాణసంయుతం,
అక్షిణ్యాగామి సహితం సిద్ధసాధ్యసమన్వితం. ౨౬
అష్టభోగ మిదం సర్వస్వామ్య మానంద్రతారకం,
సహిరణ్య పయోధారాపూర్వకం దత్తవా న్ముదా. ౨౭
శ్రీమన్నాచన సోమాఖ్య మహాకవికవిశేఖరః,
రాజాన మాశిషం నైవ చిరజీవీ భవత్వితి." ౨౮

సోమన కవిరాపటిమ యిరుగొత్తమ హరివంశము ప్రౌఢశైలిని రచించెను. వసంతవిలాసాది ప్రబంధ చంద్రికలను సయితి మీకవిసోమఁడు వెలయించినట్లు తెలియుచున్నది. 'సర్వజ్ఞుఁ' డను బిరుద మీబుధసర్యునకుఁ గలదు. ఉత్తరహరివంశమునుండి శైలికి—

మ. తనమూరదర్వరికిన్ గటంగటబడు తత్త్వజ్ఞుఁబు చైత్యంబునం దునుకొండం బరిషంబుపై విసరుమన్ దుర్వారుఁడై పైపయిన్ మునుఁగంబోలు శరాసిముద్గరగదా ముఖ్యాయుధ క్షేణిచేఁ గినియన్ జేసిన జేసిన్ రవి దివిన్ గ్రీడించు చందంబునన్.

శా. జేలన్ గొందలు మింటఁ గొందలు గజానీకంబుఁ గీలాలము జ్జాలంబుల బరుజింప వంచికముకో శ్వాహంబు సోహంబులన్ జాలన్ గ్రాల నిశాత హేతిలతికా సౌదామినీసామఖీ మాలంకారము దీరమున్ రెలంప నుద్యద్విక్రమ క్రీడతోన్.

## 4. మతము

బుక్కరాయఁడు వైదికసిద్ధాంతములయెడఁ గేవల విశ్వాసతత్పరుఁడైనను మతాంతరులను సమదృష్టి జూచెను. తాను శైవుఁడయ్యుఁ దనరాష్ట్రమున వైష్ణవులయు, జైనులయు మతవ్యాప్తి ధారాళముగ జరగనిచ్చెను. తన్నాశ్రయించిన మహమ్మదీయుల యందును బరమాదరభావమునఁ జేరఁదీయుచు, వారిని స్నేహభావమునఁ గాంచుచుండెను. క్రీ. శ. ౧౩౬౮ లో జైనులకును, వైష్ణవులకును గల్గిన మతవివాదసందర్భమున నీ ప్రభుఁడు మతనాయకులనెల్లర నాహ్వానించి, వారి యిక్కట్లు దిద్ది, తనహితోపదేశమువలన వారిని శాంతశీలురనుగ నొనర్చి, సామ్రాజ్యమున నెవ్వరును జాతిస్పర్థల కడ మీయక వర్తింపవలసినదని శాసించెను. ఈ హేతువున వైదిక మతావలంబులకు మాత్రమే కాక మతాంతరుల సుస్థిరసుఖజీవనమునకును విద్యానగర మాధారమై వెలసెను.

## 5. భామినీ సుల్తానుల ప్రతిఘటనము

ఒకవంక విద్యానగరసామ్రాజ్య మభివృద్ధి నొందుచుండ, వేఱొకవంక భామినీరాజు లీర్ష్యగొని దానియున్నతి నడఁగఁద్రొక్కుటకై ప్రబలతరప్రయత్నములు గావించుచు, విప్లవకలహములఁ గల్పించుకొని, తఱుచు విద్యానగరముపై దండెత్తుచుండిరి. భామినీ సుల్తానుల యీవిద్వేషమహాగ్ని నూటనలుబది సంవత్సరముల కాల మేకధారగ నిరాఘాటముగ జ్వలించుచుండెను.

## 6. యుద్ధములు*

బుక్కరాయఁడు భామినీ సుల్తానులతో రెండుపర్యాయములు పోరవలసివచ్చినది. ఇందు మొదటి పోరాటము ౧౩౬౬ లో మహమ్మదుషాతోను, రెండవది ౧౩౭౫ లో ముజాహిదుషాతోను, సంభవించెను. భామినీరాజులు విద్యానగరముతో జగడము పెట్టుకొనిన యీరెండుతడవలను బొందిన ప్రయోజనము కానుపించ దేమిఁ గలుగ దయ్యెను. వారు విస్తారముగ సైన్యముఁ గోలుపోయి విశేష వ్యయప్రయాసములపాలగుచు లోనైరి. రెండవవాఁడగు ముజాహిదుషా రెండు మారులును దన తెలివికిఁ దగినపరిభవమే పొందెను. బుక్కరాయఁడీ రెండుదండయాత్రలలో మిగుల గాసిఁ జెందెనని ఫెరిస్తా తెల్పుచున్నాఁడు; కాని యట్లు బాధనొందఁదగిన ప్రమేయమే బుక్కరాయనికిఁ గలుగలేదు. రాయఁ డసాధారణపురుషుఁడు, నప్రతిమ వీరాగ్రేసరుఁడు నగు మహాయోధుఁడు.

## 7. రాయని విక్రమస్ఫూర్తి

ఈ విషయమున శాసనము లేమి చెప్పుచున్నవో తెలుసుకొనఁ జాతము. ఎపిగ్రాఫియా కర్ణాటికా (౫౬ వ సంపు. జి. డి. ౪౬ వ సంఖ్యగల) తామ్రశాసనము బుక్కరాయని విక్రమమునుగూర్చి యిట్లు తెల్పుచున్నది:

"బుక్కరాయో భవ చ్ఛ్రీమాన్ భుజార్జిత పరాక్రమః,
మేదినీవ ప్రజాయేన స్వపుత్రా ఇవ రక్షితాః. ౧౩

* ఈయుద్ధములఁగూర్చియు, విశదవిషయములను గూర్చియు విపులవివరణములు 'విద్యానగర చరిత్రము'నఁ గాంచగును.

> రాజరాజభుజంగో యః పరరాజ భయంకరః,
> హిందురాయ సురత్రాణ ఇత్యేతై రుపశోభితః." ౧౪

హిందూరాజ శిరోమణియనియు, శ్రీప్రతాపసుఁడనియు, శత్రు రాజహంతకుఁడనియు, ససత్యవాదులపట్ల యసహనశీలుఁడగు నాయకుఁ డనియుఁ, బ్రాక్పశ్చిమదక్షిణ మహాసముద్రాధీశుఁడనియుఁ, బ్రాచీన శాసనము శ్రీప్రతాపాధ్యున్నిగూర్చి నుడువుచున్నవి; మఱియు నీతఁడు ప్రతిబద్ధమగు స్థైర్యసాహసౌదార్యనిధియనియు, సంగ్రామరంగమున శోషాధీనమానసుఁడై యసంతత బాహువిక్రమమును జూపు వీరాధివీరుఁ డనియు, సాహసశ్లోకీవి గాలాంతకునివలె విజృంభించుచుఁ బరిపంథి యోధుల నెదుర్కొనినపు డాతని తీక్ష్ణప్రతాపాగ్నికిఁ దురుష్క సుల్తానుల సదవాల్లములు వాడి వత్తలగుచుండునవియు, విరోధిరాజులు ముఖావలోకన మాత్రముననే నడఁకిపోవుచుండి-రనియుఁ దెల్పు వాధారము లెన్నియో కలవు. అందొక్కటి—

> "భంగాకళింగా మితశౌర్యవృత్తేర్వంగా విభిన్నాంగ విఘూర్ణనేత్రాః;
> ఆంధ్రశ్చ రంధ్రాణి విశంతి యస్య, బాహాగ్రఖడ్గేన విశీర్యమాణాః.
> తురుష్కాశ్చ సువర్ణపదనాః పాండ్యభూపాః పలాయితాః,
> స్వభుజార్జితవీర్యేణ తస్మిన్ రాజ్యం ప్రశాసతి."

ఇట్టి వీరవతంసమునకు ఫెరిస్తా రచించిన భామినీసుల్తానుల చరిత్రమున పూరులకనమైనపోలుఁ దావు లేకపోవుట విపరీతవిషయము గాకుండునా? ఈవీరుఁ డుగ్రజానిరోలుబడి సమయమునకే తురుష్కులను దరిమి, తుంగభద్రానదికి దక్షిణమునున్న రాష్ట్రమంతయును, దూర్పున నోఢ్రకళింగదేశములను జయించెను. ఈతనిరాగ్రేసరుఁ డాంధ్రకాంభోజ కొంకణఘూర్జర తురుష్కరాజులకు పోలుబల్లెమయి యుండెను. ఇతఁడు బల్లాలరాజులకును, నోరుగంటి ప్రభువులకును, దక్షిణ సామంతనృపతులకును నండయై, వారియున్నతిని బోషింప నన్నివిధములఁ బ్రయత్నింపఁజొచ్చెను. దక్షిణదేశమునందలి రాజులందఱును గల్పకమువలెఁ దమకు రక్షకముగ నుండెడి యీవిద్యానగర పాలకుని పురోభివృద్ధియే నిరంతరము నభిలషించుచుండిరి.

## 8. రాజ్యవ్యాప్తి

ఫెరిస్తా రాయని సత్త్వహీనునిగఁ జిత్రించినను, రాయఁడు తన రాజ్యమును నలుదెసలకు వ్యాపింపఁజేసెననియు, నాతనికాలమున విద్యానగరరాజ్యము భామినీరాష్ట్రమునకంటె సర్వవిధముల నుత్కృష్టదశయందుండెననియు నాతఁ డంగీకరించుచున్నాఁడు; మఱియు నోరిస్సా కొలంబో మలబారురాష్ట్రములయు, సింహళము మొదలగు ద్వీపములయు నృపులు శ్రీప్రభున కనర్ఘములైన కానుక లేటేటఁ బంపుచుండి రనికూడ నాతఁడు వ్యక్తపఱచుచున్నాఁడు. సమకాలికులగు ప్రభువులందఱిలోను బుక్కరాయఁ డెల్లవిధముల నద్వితీయుఁడై విలసిల్లెనని చరిత్రములు రూఢిగఁ దెల్పుచున్నవి.

## 9. నాఁటి భారతదేశభాగములు

బుక్కరాయని రాజ్యాంగ వ్యవహారములనుగూర్చి వర్ణించుటకుముందు నాఁటియన్యదేశపరిస్థితుల నిట సంగ్రహముగ నివేదించెదము. ఆదినములలో భారతదేశమున దక్షిణమునందు భామినీ విద్యానగర రాజ్యములును, నుత్తరహిందూస్థానమున మేవాడ ఢిల్లీ రాజ్యములును బలవత్తరదశలో నుండినవి. కృష్ణానదికి దక్షిణమునఁగల రాష్ట్రభాగము లన్నియు, భుజబలరాయఁడగు బుక్కరాయని బాహాటోపకారణమున నన్యరాజులవలని యొత్తిడినిగూర్చి కలనైనఁ దలఁపక నిర్విచారముగ నుండి, సుఖజీవనముచేయుచుండెను.

౧. భామినీరాజ్యము—వింధ్యకుదిగువ 'హసన్ గంగూ భామినీ' యను తురుష్కసరదారునివలన స్థాపింపఁబడిన భామినీరాజ్యమునక్కడ నందలి హిందువులకును, హిందూరాజ్యములకును బ్రక్కలోని బల్లెమయి యుండినది. బుక్కరాయఁడు రాజ్యారూఢుఁ డగుటకు మూఁడేండ్లకు ముందు ౧౩౪౭ న నీరాజ్యము నెలకొనిన దగుటవలనఁ గ్రొత్తయుడుకులో భామినీప్రభుల హోవడి స్వరాజ్యములోని యన్యజాతి జనులకును, బరిసరమండల ప్రజలకును బహుళవేదనాకరమై దుస్సహముగ నుండెను. ఆవజీరులు తమరాష్ట్రమునందలి మతాంతరులఁ గడగంటఁ జూచుచు నాప్రజ లెట్టియల్పాపరాధముఁ గావించినను వారిని గ్రూరశిక్షలకు నులిచేయుచుండిరి. బుక్కరాయని సమకాలీనుఁడగు మహమ్మదుషా తనపాలనమునఁ దెల్లబడిలోనుండిన హింసావాదములు కరఁగించిన హేతువున, నసంఖ్యాకులగు హిందువులను గతిసంపదవల పాలుగావించెను. తనరాజ్యపుఁ బొలిమేరలలోనుండు నోరుగల్లు, ఓఢ్రము మొదలగు రాష్ట్రములపైఁ బడి, ఉనులను వధించి, వారిసంపదలెల్లఁ గొల్లగొని పెట్టుచుండువాఁడు. ఇట్టి యాతనిదాడి నెదుర్కొనలేక యోరుఁగంటిరాజు నాల్గులక్షలరూపాయల వెలగల రత్నసింహాసనము బహుమతిగనిచ్చినను, నీతఁడు తృప్తినొందలేదు. బుక్కరాయని సమకాలీనుఁడగు మహమ్మదుషా తనపాలనమునఁ జెల్లబడిలో నుండిన హింసావాదములు... 

౨. మేవాడరాష్ట్రము—రాజపుత్రస్థానమున మేవాడరాష్ట్ర పాలకుఁడగు హమీరుఁడు బుక్కరాయని సమకాలీనుఁడు. హిందూదేశభాగములలో నీమేవాడరాజ్యము చాలఁ బురాతనమైనదియు, నద్వితీయమైనదియు. నాఁటి సంస్థానములలోనెల్ల శిరోభూషణముగ వెలసిన చిత్తోడ్గడము దీనిప్రధాన నగరము. ౧౩౦౩ వ సంవత్సరమున నల్లాయుద్దీను చిత్తోడ్గడమును ముట్టడించి మేవాడరాజ్యమును హరించినవిధము చరిత్రప్రపంచమునఁ జాలఁ బ్రాముఖ్యమైనవిషయము. ఆసందర్భమున రాజపత్నులు, కన్యలు మొదలగు సాధ్వీమతల్లులెల్లరు మానరక్షణార్థమై చితిహోత్రమునఁ దృణములవలెఁ దమప్రాణముల నర్పించిరి. రాజ్యసంరక్షణమునకై వేలకొలఁది రాజపుత్ర వీరయోధులు క్షాత్రవసమరాంగణమున ప్రతాపదహనలాభులకరాశకీలలఁ గాఁగిలించుకొని కరఁగిపోయిన విషయము మఱవఁగానిది. ఆ సమయముననే

మేవాడ సామ్రాజ్యాధినాథుఁ డగు లక్ష్మణసింహుఁడు, నాతని పదునొకండుగురు పుత్రులు వీరస్వర్గ మలంకరింపఁబోయినది. ఈ లక్ష్మణసింహుని ప్రథమపుత్రుని కుమారుఁడే పైఁ బేర్కొనిన హమీరుఁడు. యుద్ధావసానమున నీ హమీరుఁడు జీవించియున్నను సామ్రాజ్యము తురుష్కుల యధీనమగుటచేఁ, దాను కేల్వాడలో నజ్ఞాతవాస మొనర్పవలసివచ్చెను. అయిన నా వీరుఁ డస్థైర్యము నొందక చవాటులను భిల్లుల సైదుపేలమందిని గూర్చుకొని, తురుష్కుల పరగణాలపైఁ బడి పట్టణములఁ గొల్లగొనుచు, వాని నొక్కటొక్కటిగ నాక్రమింపఁ దొడఁగెను. ఇవ్విధమున నాతఁడు రాజ్యసంపాదనమునకై బహుళ ప్రయత్నించుచు మహమ్మదీయులకుఁ బ్రబలప్రతిస్పర్థియైనను, వారి ప్రతినిధియగు మాలదేవునితో మైత్రిసల్పి, యాతనికుమారిని బరిగ్రహించి తిన్నగ నా దుర్గము సయితము స్వీకొనెను. ఇది తెలిసి యప్పటిఢిల్లీశ్వరుఁడగు మహమ్మదుఖిల్జి హమీరునిపైకి రాఁగా, చిత్తోడ్గడనాథుఁడు బూంది, గ్వాలియరు, జయపురము, యోధపురము మున్నగు సంస్థానాధీశులను దనవంకకు మరల్చుకొని, వారితోఁ గూడ తురుష్కసైన్యము నోడించి, మ్లేచ్ఛరాజును బట్టి మూఁడుమాసములకాలము చెఱలో నుంచెను. హమీర్ను బట్టుమూర్తిండుఁ డిట్లు మాసిపోయిన సిసోదియా వంశజుల కీర్తిజ్యోత్స్నలను రాజపుత్రస్థానమున మరల వెలిగొల్పుటకై సల్పిన పరిశ్రమ యింతింత కాదు. ఇందుకొఱకు నాతఁడు తనజీవితకాలమునఁ జాలభాగము వినియోగింపవలసినది విధిగ సంభవించెను. అతఁ డనవరతము సమరవిహార మొనర్చుచు ఢిల్లీసామ్రాజ్యమువలనకుఁ దన రాజ్యమును వ్యాపింపఁజేసెను! మేవాడరాష్ట్రి మిట్లయి నిరంతరము కలహోద్యమమున మగ్నమగుటచే, వశాంతజీవనమున కష్టనష్టము లన్నియు తరంగములవలెను నటు నిటు లుఱ్ఱూఁతలూఁగవలసిన పరిస్థితి నాఁటి రాజపుత్ర ప్రజాతతికిఁ దప్పనిసరిగఁ బ్రాప్తించి యుండును; గాన నానాఁడు మేవాడ రాజ్యసౌఖ్యము సన్నగిలియుండె ననఁదగును.

౩. ఢిల్లీసామ్రాజ్యము—బుక్కరాయుని సమయమున నుత్తర హిందూస్థానము 'ఫిరోజా తుఘులకు' అను వాతని పరిపాలనమున నుండెను. ఆపాదుషా తన పినతండ్రియగు మహమ్మదు తుఘులకు నిర్మించిన కఠోరశాసనముల నెల్లఁ దొలఁగించి ప్రజాహితమున కత్యవసరములగు కైంకర్యముల నెన్నింటినో కావించి దొడ్డరాజని పేరొందినను, నాతని మతవిద్వేషము మాత్రము హిందువులకు దుస్సహమయ్యెను. హిందువుల మతగ్రంథములను, వారి దేవసదనములను, విగ్రహములను ఫిరోజాషా ధ్వంస మొనర్చుటయే కాక, యాతఁ డొక్కొక హిందువునకును జుట్టుపన్ను విధించెను. దానిఁ జెల్లింపక యెందఱో ప్రాణములను గోల్పోయిరి. కాని పాదుషా పన్ను గ్రహించుటను మాత్రము మానఁడయ్యెను. నాస్తికమత మవలంబించుట లంచమును గ్రహించుటవలె నపరాధము క్రిందఁ బరిగణించి, యట్టి మతావలంబులకు శిక్ష విధించుచుంటినని ఫిరోజా స్వీయచరిత్రమున వ్రాసికొనెను. ఇట్టి నిరంకుశాధికారపూర్వకమగు మతవిద్వేషము దావవహ్నివలె దహింపఁజొచ్చుటచే, మతాభిమాన నిరతు లగు హిందువు లనేకు లభిజనము వీడి, కాంతికరజీవనమునకై విద్యానగరమునకుఁ దరలు చుండిరి.

## 10. యూరపు

౧. సారసస్ సామ్రాజ్యభాగము:—పదునాల్గవ శతాబ్దమున యూరపు ఖండమునం దస్యున్నస్థితిలో నుండిన రాష్ట్రములలో 'సారసస్' మహాసామ్రాజ్య భాగమగు స్పెయిన్ ముఖ్యమైన దనవచ్చును. ఒకటవ శతాబ్దమున నిది (స్పెయిన్) పోర్చుగల్ రాష్ట్రముతోఁ జేరి 'ఐబీరియన్ భాగము' (Iberian Plc) అనుపేర రోమకసామ్రాజ్యమున నంతర్గతమయి యుండి, నాల్గువందల సంవత్సరముల కాలము సామాన్యాభివృద్ధి నందుటయుఁ; దరువాత విసీగాత్తుల (Visigoths) వశమయి యారేడు శతాబ్దములలో నత్యున్నతదశ నందుటయు యూరపు చరిత్రపాఠకుల కెల్లరకును విస్పష్టమె. అంతకు రెండుశతాబ్దములకుఁ బూర్వమే ఫరాసు (France) దేశము నాక్రమించి, రోమక సామ్రాజ్యమునుండి దానిని విడఁదీసికొనిన ఫ్రాంకులు స్పెయిన్ రాష్ట్రమును విసీగాత్తులనుండి లాగ యత్నించుటచే వల్లకలోలములు ప్రబలె ననుటయుఁ గ్రొత్త కాదు. ఏడవశతాబ్దారంభములో రోమక సామ్రాజ్య ప్రభుఁడగు 'జస్టినియన్' విసీగాత్తుల వారినుండి స్పెయిన్ దేశము నూడఁదీయఁ బ్రయత్నించుటయు, నాతఁడు మరణింపఁగనే విసీగాత్తుల మరలఁ దెలరేఁగుటయు సుప్రసిద్ధాంశము. ఏడవ శతాబ్దాంతము వరకు నిట్లు స్పెయిన్ వివిధ పరిస్థితులకుఁ దావలమయి యుండినను, దదభివృద్ధికి మాత్రము లోపము గలుగలేదని యూరపు చరిత్రవలన మనకు గ్రాహ్య మగుచున్నది. ఎనిమిదవ శతాబ్దారంభము(౭౧౧)లో నరబ్బీలు మహమ్మదీయ మతమును వ్యాపింపఁజేయుచు, నాసియా పశ్చిమరాష్ట్రములే కాక యాఫ్రికా యుత్తర భాగమునంతయును లోఁబఱచుకొని, యావల జిబ్రాల్టరుసంధిని దాఁటి, స్పెయినుఁ జొచ్చి, దానిని స్వవశ మొనర్చుకొనిరి. అరబ్బీ లిట్లు సాధించిన రాష్ట్రముల మొత్తమే పైఁ బేర్కొనిన సారసస్ మహాసామ్రాజ్యము. ఇది మహమ్మదీయఖలీఫాల పాలనమున ౧౦౪౯ వరకు రమారమి ౩ వందల యేండ్లకాలము క్రమోన్నతి నందినది. పదవ శతాబ్దానంతరము కలహములు పైకొని యాందోళనములు పయింబయిని హెచ్చిల్లుటచే, నన్యదేశముల రాపిడి నుండి తొలఁగి తనస్వాతంత్ర్యమును, బ్రతిభను నిల్పుకొనుట కొఱకే సామ్రాజ్యము స్వసంరక్షణార్థము సైన్య సన్నాహ వ్యాపారమున మగ్న మగుటవలన నాగరకతాభివృద్ధికిఁగాని, కళాభివృద్ధికిఁగాని చేయఁదగినంత కృషి యది చేయఁజాలక పోయెను. అయినను నాఁటి సామ్రాజ్యపాలకులు యూరపు నాగరకతకు బీజార్పణ మొనర్పఁ గలిగిరని మాత్రము చెప్పక తప్పదు.

౨. ఆంగ్ల దేశము—నాగరకతయందేమి, యైశ్వర్యమునందేమి, నేఁడు ప్రపంచమున నసాధారణ వైభవమున విలసిల్లెడి యాంగ్లభూమి

కూడ బుక్క-రాయని కాలమున నుత్కృష్టదశలో నుండె ననుటకు గాదు. ఆదినములలో (౧౩౨౭ నుండి ౧౩౭౭ వరకు) నాంగ్లభూమిని పాలించుచుండిన రాజు మూడవ యెడ్వర్డు. వాఁడు సమరాంకోత్సుకుఁడై యుండగా, దారిద్ర్యదేవత పేదోక వంకను బ్రజలపై స్వేచ్ఛాధికారము సల్పఁగడంగినది. అందులకుఁ దోడుగఁ బ్రభుఁడు స్పెయిన్ దేశముపై దండయాత్ర సాగింపఁ దలంచి, ప్రజపైఁ గ్రొత్త పన్నులు విధించెను. వానిని చెల్లింప లేక యొక భాగము వారు తిరుగఁబడిరి. 'బ్లాక్ డెత్' (Black Death) అను రోగము దేశమును రుడిచిపెట్టఁజొచ్చెను. ఆంగ్లదేశమున మూఁడవ వంతుజను లావ్యాధికి బలియైరి. ఇదిగాక ౧౩౬౧-౬౯ సంవత్సరములు వరుసు మహామారి (Plague) వలన వనేకులు గ్రుక్కిరి. శవసంస్కారకర్మ నడపుట కాచార్యుఁడే కఱవయ్యెను. పనివారు లభింపకపోయిరి. కూలిహెచ్చెను. వస్తువుల వెల లపారముగఁ బెరిఁగినవి. ప్రభుత్వము వారు ధర లెప్పటివలె నుంపఁజూచియు విఫలప్రయత్నులైరి. సేవకులు సరిగాఁ బనిచేయుట లేదని యజమానులును, యజమానులు దయతో చూడరని సేవకులును దగవులాడుచుండిరి. పనివారికి భృతియీయఁజాలనిస్థితికి యజమానులు వచ్చిరి. పరాసుకోధకుల వాక్కులు తగ్గింపఁబడినవి. వారు యోగులవలె వర్తింపవలెనని కొందఱును, భోగముల ననుభవింపవచ్చునని మఱికొందఱును బట్టి పల్లార్చుచుండిరి. ఇట్లేయేవిధముగఁ జూచినను నింగ్లండు కేవలము సారహీనమై యరాజకస్థితిలో నల్లాడు చుండెను.

## 11. బుక్క-రాయని విద్యానగర రాజ్యాంగ పరిస్థితి

బుక్క-రాయఁడు దక్షిణ దేశము నందలి కలహశీలురగు రాజుల నెల్లరఁ దొలఁగించి సామంత ప్రభువులఁ గ్రమ పద్ధతిలోఁ ద్రిప్పెను. ఈతఁడు తనసోదరులను, మేనల్లుండ్రను, బుత్రులను, సమీప బంధువులను మాత్రమే ప్రధానోద్యోగములకు వినియోగించు చుండెను. రాజ్యపరిపాలనమున కొక సుస్థిర స్వరూప మేర్పడినది యీప్రభుని కాలముననే. ప్రజాపాలనమును, స్వసైన్య వ్యవహారములను మిగుల సమర్థతతో నిర్వహించుటలోఁ బేరొంది, యావిషయమునఁ బ్రపంచమునకే యాదర్శప్రాయుఁడైన నాయకుఁడీతఁడు. ఈతని కొరతవమున సామ్రాజ్యమునం దంతటను బావులు, చెఱువులు, గొప్ప గొప్ప కాలువలు, వంతెనలు నసంఖ్యాకములుగ విస్తరిల్లెను. ఎందుఁ జూచినను వ్యవసాయాభివృద్ధికిఁ దగిన సౌకర్యములను విరివిగఁ గల్పించి, కృషిని సర్వవిధముల వృద్ధి నొందించి కాఁపులకెల్ల నోముపంటయైన మహారాజీతఁడు. ఉత్తరహిందూస్థానమునఁ జెఱువు తటాకములను, కాలువలను చెలయించి, వానిసాయమున నద్భుత వ్యవసాయమును

జెంపొందించుటలో ఢిల్లీశ్వరుఁడగు ఫిరోజుతుఘలక్కునకు విద్యానగరాంధ్ర రాజ్యముల యందలి తటాకములు, కాలువలు, వానివలని యుపయోగములునే మార్గదర్శకము లయ్యెను. తత్పూర్వము ఢిల్లీ ప్రాంతమునఁ గాలువల నిర్మాణపద్ధతియే లేకుండినది. అందువలనమున వ్యవసాయమునకుఁ గల్గుప్రయోజన మచ్చటివారు గుర్తెఱుంగకుండిరి. విద్యానగర సామ్రాజ్యమునఁ బంటనేలలకు భూస్వభావము ననుసరించి 'శిరము' లేర్పఱుపఁబడినవి. రైతులు శ్రమలేకమేని లేక పన్నుల నొసఁగుచుండిరి. సామ్రాజ్యమునఁ బ్రజాసంఖ్య సమృద్ధిగ నెలకొనెను. జనులందఱు నిత్యకల్యాణముఁ బచ్చతోరణమునై తొమరతెంపరగా మల్లెపిల్లచుండిరనియు, వారు సక్రమ న్యాయపరిపాలనమునకు లోనై యేవేళను దలపూవాడక యానందకర జీవనమున సంతృప్తులై మెలఁగుచుండిరనియు, న్యూనిజ్, ఫెరిస్తా మున్నగు చరిత్రకారుల వ్రాఁతలు తెల్పుచున్నవి. రాజు పేరను, నాతని సన్నిహిత బంధువులలో నొక్కొక్కరి పేరునను సర్వసాధారణముగ నంతటను నసంఖ్యాకములగు కుంటలు, గ్రామములు, పట్టణములు హెచ్చెను. రాయని యేలుబడియం దాతని రాష్ట్రమున నైహిక విద్యలే కాక యాధ్యాత్మిక విద్యకుఁ గూడఁ బెక్కుపాఠశాలలు నెలకొనెను. విద్యానగరము గణనాతీతములగు సౌధముల కిక్కయై, హిందూదేశమునకేంద్ర వర్తక స్థానమై, వాణిజ్యమున నన్ని రాజ్యములతోను మిక్కుటమగు సంబంధము గల్గించుకొని, మహత్తరాభివృద్ధిని బొందెను. మరియు నది సమస్త వస్తువులకు స్థానమై, సర్వ సంపదలకు సదనమై, తోడిరాష్ట్రములలో నెల్ల నన్నివిధముల పేరుబడితియై చెలువారుచు, భారతదేశమున ముఖ్యముగ మహమ్మదీయ సుల్తానుల దృష్టిని సమాకర్షించెను.

## 12. బుక్క-రాయని చరమదశ

క్రీ. శ. ౧౩౩౬ లో విద్యానగరము పునరుద్ధరింపఁబడిన సమయమున బుక్క-రాయఁడు కౌమార దశలో నుండి, సేనానాయకత్వము వహించి, కార్యనిధియై, సామ్రాజ్య సంస్థాపనానంతరము నలువది సంవత్సరములకు నైననే సీరవరుల నదితనుగు నత్కృష్ట జీవనముఁ బొందెను. స్వర్గస్థుఁ డగునప్పటి కీనృపాలుఁడు కడునృద్ధుఁడు. ఈదీర్ఘకాలములో నీతఁ డొకదండనాథుఁడుగ నుండి, తొల్లి చిన్నరాష్ట్రముగ నుండిన విద్యానగరము నేఁటేఁట వృద్ధినొందించి, కోటానకోట్ల ద్రవ్య మాదాయము వచ్చు మహాసామ్రాజ్యముగ మార్చి వైచెను. ఈ ప్రభుచంద్రుఁ డిట్లు తన సామ్రాజ్యమును మహోత్కృష్ట దశకుఁ దెచ్చి, క్రీ. శ. ౧౩౭౭ వ యేట ఫిబ్రవరి నెల చివరనో, మార్చి నెల మొదటనో యస్తంగతుఁ డయ్యెను.

# సి సి లీ

రంగనాయకులు గారు (అడ్వొకేటు)

క్రీస్తుశకము ౧౯ వ శతాబ్దప్రారంభమున, ఇటాలియను ప్రజలు, ఎటుల స్వాతంత్ర్యమును సంపాదింతు మోయని చింతించు చుండిరి. ఇటలీ ప్రజల స్వాతంత్ర్యదాహప్రవాహము లావులవ, అనేక ఉద్యమములు కాలక్రమేణ వచ్చుచుండెను. అందు మాజినీ, గారిబాల్డీ, కావూరు, విక్టరు ఎమాన్యుయలు అనువారు సుప్రసిద్ధులు. వారిలో గారిబాల్డీ, అనువారు స్వాతంత్ర్య మహోద్యమము తన ప్రజలకు సంపాదించుటకై కంకణము కట్టుకొని స్వతంత్రముగ నొక బలగమును దక్షిణ-ఇటలీయందు బయలుదేరదీసి ఈభాగమున కష్టదుర్భరమైన నేపుల్సురాజును ఆకస్మికముగ దెబ్బతీయుచు, ఓడించుచు, తానే దీనివల్ల "సిసిలీ" యను ద్వీపమునకు పరుగెత్తి, దాగొనుచు, బాల క్రమ కల్పించెను. క్రమముగా గారిబాల్డీ బలగము వృద్ధినొందెను. "సిసిలీ" ద్వీపము నేపుల్సురాజ్యము నుండి విడిపడి, ఆయన వశిపాలన క్రిందకు వచ్చెను. అంతే, గారిబాల్డీ సిసిలీ ప్రజలసైన్యముతో, దక్షిణ ఇటలీ పై దాడిచేసెను, నేపుల్సు రాజ్యమును వశపరచుకొని, ఇటలీ స్వాతంత్ర్యపతాకమును దాల్చి, అంత రోమునగరమును వశపరచు కొనుటకై తన సైన్యమును నడుపజొచ్చెను. కావూరు మహామంత్రి సలహాపై, ఎమాన్యుయలు మహారాజు గారిబాల్డీని దక్షిణ ఇటలీయందు కలసుకొని గౌరవించి ఆతని క్రిందనున్న రాజ్యమునంతయు తనకు ధారాదత్తము చేసుకొనెను. దానితో, ఇటలీదేశమంతయూ పీడ్మాంటురాజైన ఎమాన్యుయలు క్రిందకు వచ్చి, ఏకరాజ్యమై పరదేశీయుల పరిపాలనమునుండి విడివడి స్వతంత్ర జాతీయ ప్రభుత్వమును పొందెను. అట్టి మహాకార్యమునకు దిక్కుదలగా సాయపడిన "గారిబాల్డీ"కి వాసస్థానము ఈ "సిసిలీ" ద్వీపము. ఆమహావీరుని అనుసరించి, ఇటలీ స్వాతంత్ర్యమృతకలశమును అడుగకయే, ప్రతిఫలము కోరకయే తమ వేలకొలది ప్రాణముల సమర్పణ చెలువరించిసిమ్మటు, లక్షలకొలది ధనము వెచ్చించిన సిమ్మటు దేశమాతకు కానుకగా అత్యధికభక్తితో నేపుల్సురాజ్యము నిచ్చిన మహావీరులు ఈ "సిసిలీ" ద్వీపవాసులు. ప్రతి ఇటాలియను ఈద్వీపము గాంచినప్పు డెక్కుత్సాహయుతుడగు. సిసిలీ ప్రజలయం దప్పటి నుండి ఇటాలియను ప్రజల కత్యంతప్రేమ, భక్తి, నమ్మకము కలవు.

ఈ "సిసిలీ" ద్వీపము ప్రక్కగా, "మెస్సిని" జలసంధి ద్వారా, ఇప్పటికి నాల్గుమారు లిటలీకి వెళ్లియుంటి. వినవచ్చి కూడ ఈద్వీపమునందలి నవ్యోత్సాహము అప్రయత్నపూర్వకముగ కల్గుచున్నది. వీరులకు జన్మస్థానమగుటయే కాక, పాశ్చాత్య ఖండమునందెల్ల ప్రఖ్యాతి గాంచిన భయంకరమగు, "ఎట్నా" యను అగ్నిపర్వత మిందు కలదు. ఈఖండపు ప్రజలకందరకు ప్రేమపాత్రము, రుచియుతమునగు ద్రాక్ష యీద్వీపమునందలి ప్రధానమైనపంట. ద్రాక్షసారాయి మనవారుపాలకు అత్యంతప్రీతికరమై యుండెను. ఫ్రాన్సు, ఇటలీ, సిసిలీలయందు ప్రతివారు సారాయిని అధికముగ త్రాగి, ఆనందించు చున్నారు. ఒకప్పుడు డింగ్లండుకు ప్రధానమంత్రియైన "పిట్టు" యనువారు ఈదేశములవారికి ఇంగ్లీషువారు భోగ్యమను బహుమతి "ద్రాక్షసారాయి" తిరిగికొను నదు పాయము లున్న ఎంతయో సుఖ మనెను. అట్టి సుఖప్రదమగు ద్రాక్షసారాయి ఈ ద్వీపముయొక్క ప్రధానమైన పంట! వ్యవసాయము, కొల్ల. పరిపంపను కాని, కూరగాయలు సమృద్ధి. బార్లీ, గోధుమలు పండును. ఇచ్చటి గోవులు ప్రసిద్ధిగాంచినవి. గోవులకు పలుయు పచ్చిక బయళ్లు శృంగారదేవత కాపురగదులు.

ఇంగ్లీషు దేశపుప్రధానకవి షెల్లీ సిటలీయందు తనకాలము గడుపుచుండెను. పాశ్చాత్యదేశములకవు లనేకులు, తమజీవితములం దనేకమారు లిటలీదేశమునందు విహారముల నొనర్చిరి. అందు, సిసిలీ ద్వీపము వారందరికి అత్యధికప్రేమపాత్రము. "ప్రకృతి" తన యాభరణముల నన్నిటి నిచ్చట పెట్టి సముద్రమునందు స్నానమునకై దిగి, మహారాయి దారిపై వేచి, తిరిగి తనయాభరణముల కై కొనునట్టిదా యనునట్లు ఈద్వీపము తళతళమనుచుండును. మాపై భాగ 20 మైళ్లపొడవుగ ద్వీపము యొక్క యొక్కట్టు కనబడుచున్నది. ద్రాక్షపండ్లను పండించుటకుగాను, కంచెలను ఒకదానివెంట మరొకటిగా భూమినంతటు చేసియున్నారు. సముద్రపుటెడ్డునుండి భూమి క్రమముగా గొప్పపర్వతములుగా పైకి లేచుచున్నది. అందువలన, ఈ పెండ్లిపందిళ్లు ఒకదానిపై నొకటిగా నున్నట్లు, ప్రకృతియొక్క పూలహారముల వేయుచున్నట్లు, పచ్చతోరణముల ప్రకృతియొక్కవివాహమునకు కట్టినట్లు పైకి లేచుచున్నవి. ఎత్తైన చెట్లు లేవు. గుబురుగానున్న యడవులు లేవు. కొండయంతయూ సేద్యము చేయబడినది. ఎల్లెడ పచ్చనికంబళులతో ప్రకృతి శృంగారింపబడినదా యనునట్లున్నది. ఒక్కకొండయును రాదు. వర్షములు కురియుటచే

నప్పుడు, ప్రథమమున నున్నట్లు గూడ నుండ రందుమా ? అపచ్చిక బయలే యొయ్యారములతో, నృత్యగానములతో సొంపు ఇంపులతో సుఖమందిన పెండ్లి కూతురు లాగు కిరణప్రభావములచే కన్పడును. అంతియే కాదు. చూచువాని కన్నులంకూడ శృంగారము సృజించు చున్నవి. వాని హృదయము కూడ, శోభను వృద్ధిచేయు చున్నది. హృదయము, కన్నులు, కిరణములు, పచ్చిక, అపర్వతప్రదేశము అన్నియు చేరి అత్యద్భుతమూర్తిని, అపూర్వప్రదర్శనమును, కలుగజేసినవి. నేను కవినికాను. లేనిచో, నాయుత్సాహము, నా సుఖము, నా దివ్యమగు సంపూర్తియగు అత్యద్భుతమగు ఆత్మసంతృప్తి ఎన్ని యూహ ఘనములగు పద్యములద్వారా, వెలువడెడిదో చెప్పవలవి కాదు. అటులనే, వివిధప్రజలకు వివిధవిధములుగా ఈదృశ్యమే తోచి యుండును. నాకు తట్టిన హాస్యములు ఇతరులకు అరుచికరముగాను, అసభ్యముగాను ఉండి యుండును. ఆకసముపై నున్న నాకు గొప్ప రెవలె నుండిన మరొకనికి సుద్రమువలె నుండును. నే మిద్దరము తగవులాడిన ఫలితమేమి ? సరేకాని, నెత్తిపై కుంపటి పెట్టుకొని, జీవించువా రున్నారా? ఇంట్లో త్రాచుపాము పెట్టుకొని, పక్కలను బల్లెము పెట్టుకొని భార్యవద్ద ఆపెప్రాణస్నేహితుని పెట్టి ఏకైక శాంతితో సంతృప్తితో భయరహితముగ నుండగలరా ? ఈరెండు బస్తీలయందున్న ప్రజలకు నెత్తిపై నున్న యీ యగ్నిపర్వతము, ప్రక్కన మైళ్లకొలదిగా నున్న లావా యగ్నిప్రవాహము ఎంతభయంకరమైనది చెప్పకయే చెప్పుచున్నది. ప్రతిదినము, ప్రతివాడు, నెత్తియెత్తి చూచిన అగ్నిపొగ కానవగు. ఎప్పు డేమివచ్చి మైనబడునో ! ఎప్పుడు అగ్నిప్రవాహము బయలుదేరునో ? కాని, వారు నివసించుచునే యున్నారు. "అంతారామ మయం" అను భగవద్భక్తియందు నమ్మక ముంచుచున్నారా !

ఈద్వీపములన్నియు, ఒకప్పుడు కలిసియుండెడివి. ఎందులకు, ఎప్పుడు విడిపడి పోయినవో జ్యాయాలజీ యను శాస్త్రము చదివిన వారికే తోచును.

ఆ ప్రక్కన ఉన్న ఆజండాగల చిన్నపర్వత మెన్నిశతాబ్దముల క్రిందము విడిపడినదో ఇంక నెన్నిశతాబ్దము లిట్లేయుండునో ! చుట్టును అపారమైన సముద్రము. ఎంతటి నిప్పునైన యార్పగల నీరు. మధ్య నీయగ్నిపర్వతము ఎల్లప్పుడు నిప్పును గ్రక్కుచుండుట, ఆశ్చర్యకరమైన విషయముగదా ! మైలో, రెండుమైళ్లో లోతున సముద్రముండు. కాని క్రింద భూమి కలదు. ఈద్వీప మాభూమితో సంబంధించి యున్నది. కాన ఈ నిప్పు ఆభూమిలో నుండి, ఎన్నట నుండియో బయలుదేరుచున్నది. భూమిలోపల నుండుచున్న ద్రవపదార్థమైన లావాయను ప్రవాహము కలదు. అయ్యది సూర్యుడు, చంద్రుడు, భూమి ఇతర గ్రహముల మధ్యగల పరస్పర ఆకర్షణశక్తుల ననుసరించి అప్పుడప్పుడు, ఒక్కొక్కచోట క్రొత్తమార్గముల నవలంబించు చుండును. అందువలననే కొన్ని పర్వతములు మాయమగుట; క్రొత్తపర్వతములు లేచుచుండుట; ఇదివరకు లేనిచోట నగ్నిపర్వతములు పుట్టుచుంట కలుగును. ఒకప్పుడు, సింధు పంజాబుదేశము లున్నచోట సముద్ర ముండెడిదట. ఇంగ్లండు, ఐర్లండు యూరపుఖండముతో కలిసి యుండెడివట. అటులనే ఈద్వీపము లన్నియు కలిసి యుండి, సిసిలీ ద్వీపముతో నేకమై ఇటలీదేశముతో కలయిక పొంది యుండెనో ప్రు. పైగా ఒకప్పుడు సహారాయెడారి యంతయు సముద్రమయమై యుండెడిదట. పిమ్మట సముద్రము వెనుకకు వచ్చెనట. అప్పు డానీరంత యెచ్చటికి పోయెనో ? ఈదేశము నిటుల పనులగొట్టెనా ? జాయాలజీశాస్త్రముపై మన తెలుగున ఏపుస్తకము లేకుండుట విచారకరమైన విషయము.

సిసిలీ దూరముగ నున్నది. ఇచ్చటి నుండి యందముగ లేదు. అటులనే యిక నీవ్యాసము గూడ పెద్దదగుకొలది రుచి తగ్గునను భావమున ముగించు చుంటిని.

---

# నూర్జహాను

ప్రతివాది భయంకరం పార్థసారథిగారు

ప్రపంచచరిత్రయందు, నూర్జహాను తన యనన్యసామాన్య గుణగణాధిక్యముచే నొక యపూర్వస్థానము నాక్రమించి, తన నామమును చిరస్థాయిగా నొనరించుకొనియున్నది. ప్రపంచమందు రాజ్యపరిపాలనాధురంధర లగు చక్రవర్తినులే చాల నరుదు. ఆస్వల్పసంఖ్యాకులందును, నూర్జహాను, అసామాన్యయై, యపూర్వయై, సర్వతోముఖయై వెలయు తన చాతుర్యవిశేషముచే నెల్లర హృదయము నాకర్షించుచున్నది. ఎలిజబెత్ రాణి నిరుపమాన రాజ్యతంత్రప్రావీణ్యము చేతను, మేరియా థెరిసా యజేయయుద్ధకౌశలము చేతను, విక్టోరియా మహారాజ్ఞి శాంతిస్థాపనసామర్థ్యము చేతను, యైరోపాదేశమం దున్నతి గనియున్నారు. రాణీ దుర్గావతి, చాంద్‌బీబీ, ఝాన్సీ లక్ష్మీబాయి మొదలగు రాజ్ఞీమణులు కేవల స్త్రీసామాన్యాధికమే కాక పురుషాతీతమైన యుద్ధకౌశలము చేతను, రజియా బేగము, రుద్రాంబ, తారాబాయి, ఆదిగాగల రాజ్ఞీమణులు రాజ్యపరిపాలనాధౌరంధర్యము చేతను హిందూదేశమందు బొగడ్త కెక్కియున్నారు. వీరేకాక, బోడీషియా, ఇజబెల్లా, కేథరైను వంటి మహారాణుల చరిత్రలు విస్మరణీయము లైనవి. కాని, యీ మహారాణుల నెల్ల మించి యత్యున్నతస్థానమును నూర్జహా నాక్రమించియున్నది. అందులకుంగల కారణము వారలెల్ల కేవలమొక్కొక్క విషయమునందే ప్రావీణ్యమునొంది ప్రఖ్యాతి కెక్కియుండ, నూర్జహాను ధౌరంధర్యము సర్వతోముఖమై, యిందు గల దందు లేదను సందేహము నెడమీయక, నిఖిలవిద్యాపారంగతురాలై, సకలరాజ్యతంత్ర మర్మముల నెఱింగి, సర్వజనానురంజకముగ రాజ్య మేలియుండుటయే. కాని నూర్జహాను నామమే యెఱుఁగనివా రనేకులు ప్రపంచమం దుండుటయే కాక, విశేషించి భరతఖండమందే యట్టి వా రుండుట యెంతయు శోచనీయము.

జహాంగీరు పాదుషా జీవితమందెల్ల నూర్జహానుతో నాతని వివాహమే కడుంగడు ప్రముఖ మగు విషయము. పదునైదు వత్సరములు నిర్వక్రప్రజ్ఞతో సకలరాజన్యమూర్ధామణియై మొఘలుసామ్రాజ్యమునందెల్ల నూర్జహాను ప్రాముఖ్యమును ప్రఖ్యాతిని వహించెను. కాని యామె జన్మచరిత్ర యంతయు ఎన్నియో వింత విషయములతోడను విపరీతకథలతోడను నిండియున్నది. 'డా॥గారి "హిందూస్థానచరిత్ర" యను పుస్తకమునందును, నితర రాంగ్లేయ చరిత్రలు కొన్నిటియందును, విశేషించి జాతీయవాఙ్మయములందును, నీక్రింద వివరింపబడు కథ నూర్జహాను బాల్యమును గూర్చి చెప్పబడియున్నది.

## బాల్యము

తార్తారీ దేశమం దున్నతవంశజాడును, విద్యాధికుడును, గౌరవనీయుడును నగు ఖ్వాజాఘియాస్ బే గను నొకడు సమానదశయందున్న యొక వనితను బెండ్లాడి జీవితము గడపుకొనుచు, గాలవశమున దుర్భర దారిద్ర్యదేవతకు గుఱియై కడుప గూడులేక, జీవితాధారమును గల్పించుకొను నాశతో హిందూదేశమునకు నిండుచూలాలగు తన ప్రేయసిని నొక బక్క గుఱ్ఱముపై నెక్కించి, ప్రక్కను దా నడచుచు బయలు వెడలెను. ఇట్లు పయనమై నడచుచుండ గొలదికాలములోనే యాతని కడ నున్న కడు స్వల్పధనము వ్యయమై పోయెను. అందుచే ఘియాస్ బేగు నిర్ధనుడై కడుబీభత్సమును గొలుపు మహారణ్యముల ప్రవేశించు సందర్భమున, భైక్షుకవృత్తిచే జీవితము గడుపుకొనెను. హిందూదేశమును, తార్తారీదేశమును విడదీయు నిశ్చలనిత్యశాంతిభూతములగు హిమాలయప్రాంతముల దాటుటకు దిండిలేక, మూడుదినము లుపవాసముతోనే పయన మొనర్చి, నాలవనాటి ప్రయాణమున మార్గక్రాంతయై యున్న స్థితిలో ఘియాస్ బేగు సతి సర్వశుభలక్షణసమన్విత యగు నొక శిశువును గనెను. అంత దమపోషణమునకే లభించుచుండని వ్యర్థమనోరథముతో గొన్ని యామము లట దొంగలకై యెదురు చూచి మూర్ఛాక్షయమయ సమయము సమీపించుచుండుటచే నా రహ్సిటు విడువవలసిన వారైరి. ఎటు చూచినను హృదయవిదారకము లగు వన్యమృగేంద్రముల భీకరగర్జనము లొడలు కంపింప జేయుచుండెను. ఆచిన్ని బిడ్డను దమతో గొనిపోవ శక్తిలేక, యొకతరుచ్ఛాయ నాబిడ్డను వదలి, యాకులములతో గప్పి విధిలేక, నడువ గాళ్లాడక, ఆ దంపతు లాస్థలము నెట్టెట్లో పాసి చనిరి. అట్లా బిడ్డను దిగనాడి, మూడుమేర దూరము దాటి పోయినంతనే దుఃఖాధిక్యముచే మూర్ఛితయగు తన ప్రియురాలింగాంచి మనసు నిలువక ఘియాస్ బేగు తిరుగ నాబిడ్డను విడిచిన స్థలమున కేగుపరికి యాబిడ్డను నల్లత్రాచొకటి చుట్టుకొని యుండెను. కొంతదూరమునుండియే ధ్వనిచేయ సర్ప మాబాలికను విడిచిపోయెను. తోడనే బిడ్డ నెత్తుకొని ఘియాస్ బేగు తనభార్యతో నెట్లో లాహోరు చేరెను. అచ్చట చిరపరిచితుడగు నొకమిత్రుని సహాయముచే నక్బరు నాస్థానమున నొక యుద్యోగమును సంపాదించి,



పెన్నదాటుట

ఛాయాచిత్రకారుడు : శ్రీయుత యస్. ఇ. రంగస్వామయ్యంగారు, చెన్నపురి.

లము పశ్చిమతీరమందే గడపెనను, ఢిల్లీ చక్రవర్తియగు జహాంగీరు పాదు షాను గూర్చి విశేషముగ వినియుండుటచే తాను విన్న సంగతులెల్ల దన చరిత్రయందు నింపెను. మెహరున్నీసా నపహరించుటకై షరాఫ్ఘనుని జహాంగీరే చంపించెనను. విషయము నిజమునదో నీరియం దొక్కడైన నావంగతిని దను గ్రంథములందు తెలుపకపోవుట యెంతయు శోచ్య ముగ నున్నది. ఒక్కడైన నావిషయ మణుమాత్రమైన సూచనకూడ చేయలేదు. నిజముగ నట్టి యకార్యమే జరిగియుండినచో దేశమెల్లెడ నీవిషయము ప్రాకియుండెడిది. లోకుల నోళ్లు మూయ నెవరికేశక్యము! అట్టితరి నిట్టివింతవిషయముల నెఱుంగుటయే పరమావధిగ నెంచుకొని, దేశసంచారము సలిపిన, విదేశయాత్రికు లెట్టివిషయమును జర్చింపకుం డుట సంభవించును!

ఇదికాక జహాంగీరురాజ్యమందు "ఈస్టుఇండియాకంపెనీ"వారు తమదేశమున కంపిన లేఖలు వేనవేలు గలవు. ఆలేఖలయందు గేవలము తమ వర్తకసంబంధములగు విషయములు మాత్రమేకాక, రాజకీయవిష యములనుగూడ దెలియపరచుచుండిరి. ఆ లేఖలందు ఖుస్రూవురణ మును, ఖుర్రము తిరుగుబాటును, మహాబత్ఖానుని చర్యలును జర్చింప బడియున్నవి. కాని యొకలేఖయందైనను జహాంగీరు మెహరున్నీసా యందలి మోహావేశమున షరాఫ్ఘనుని చంపించియుండెనని వ్రాయబడి యుండలేదు. "సర్ థామస్ హెర్బర్టు" జహాంగీరుని రాజ్యపాలనమున గడపతిరిగినములలో హిందూదేశమున కేగెను. అటుపిమ్మట (జహాంగీరు మరణానంతరము) పీటర్ ముండీ యను మరియొక యాత్రికు డేతెం చెను. వీరిరువురును, నూర్జహాను జహాంగీరుల విషయమై యనేకగాథ లను జెప్పిరి కాని, వారి వివాహవిషయికమును, కొందరాంగ్ల చరిత్రకా రు లాపాదించెడి యపనింద మోపియుండలేదు. ఫిరతరము గడచిన తరువాత బెర్నియరను మరియొకడు ఢిల్లీకేగి యచ్చట రాజసభయం దెల్ల స్నేహమును సంపాదించెను. ఇతడు షాజహాను, ఔరంగజేబు, రోషనారా మొదలగు మరికొందరి విషయమై చెప్ప నలవిగాని నిం దావాక్యములను వచించి యున్నాడు. ఇతడును, జహాంగీరు నూర్జహా నుల విషయమై వ్రాసినను షరాఫ్ఘనుని మరణవిషయికమగు నింద నెత్తు కొనజాలేదు. ఇట్లు సమకాలికుల సాక్ష్యము లేశమాత్రమైన లేనికార ణముచే జహాంగీరుని యపవాదము నిరాధారమని స్థాపించేయ దగి యున్నది.

ఇంతేకాక, యీకథ కొన్నిస్పష్టము లగు చరిత్రాంశములకును, మానవసహజధర్మములకును, భిన్నముగ నున్నట్లు దోచును. ప్రథమ మున, నక్బరు, సలీముమెహరున్నీసాల వివాహమున కభ్యంతర పెట్టు టకు దగుకారణమేదో యూహింప వీలుగాకున్నది. మెహరున్నీసా వాపిక్కైన పారసీకవంశమున జనించిన సర్వసుగుణసంపన్నిత యగు కన్యారత్నము. ఆమెతండ్రి ఢిల్లీపాదుషా యుద్యోగులందెల్ల మన్న తస్థానము నాక్రమించి యుండెను. హీనవంశరాజులను నమమా నమా—లేరు. సౌందర్యవతి కాదను సంశయమా—నిండుపున్నమ చంద్రుని ధిక్కరించు నామె యసమానశైథిల్యము నెంగల, దానికవకా శమే లేదు. విద్యావతి కాదందుమా—నరసముగ గవిత్వము జెప్పి యెల్లర మెప్పింపజాలిన యామె నెట్లు విద్యావతి కాదందుము! కళా విహీన యందుమా—సకల కళాప్రవీణురాలగు నామె కెవరు సాటి! ఇక, ముసల్మానులు చక్రవర్తులు సమానహోదా కలవారికే కాని యితరుల వివాహమాడరను నియమమా—లేదు. ఏకపత్నీ వ్రతమా—యంతకు ముందే నున్న. అట్టితరి నక్బరు తన తనయుడగు సలీము మెహరున్నీ సాను వివాహమాడుట కేల యభ్యంతరపెట్టవలయును? అక్బరున కీసం బంధమున కభ్యంతర మొనర్పదగు నవకాశమే లేదు. ఒకవేళ నక్బరు తన తనయుడు మెహరున్నీసాను వివాహమాడుట కిష్టగింపక ఘియ సుద్దీను నాతని తనయను షరాఫ్ఘనున కిచ్చునట్లు బలవంతపరచె నను వాక్యమును నమ్ముటకు వీలులేదు. ఏలయన—జహాంగీరు నూర్జహానుల కట్టి యనోన్యానురాగము కలదనియు, వారికి వివాహము జరుగనీ యక తానే మెహరున్నీసాకును షరాఫ్ఘనునకును వివాహము చేయిం చియుండెననియు, నూర్జహానుపై సలీమునకుగల ప్రణయమపారమనియు నక్బరు తెలిసియే యుండినచో 1599 వ సంవత్సరమున (అనగా మెహరు న్నీసా వివాహానంతరము) షరాఫ్ఘనుని సలీమున కంగరక్షకునిగ నేల నియమించుట సంభవించును? ఒకవేళ యట్లు నియమించినచో, సలీము షరాఫ్ఘను నట్లు గౌరవించి ప్రేమించుట యెట్లు తటస్థించును! తాన లచినకన్యకను బెండ్లాడినవాని నింత లాలించుట యసంభవము. జహాం గీరు, అక్బరు మరణానంతరము, ఢిల్లీసింహాసన మధిష్ఠించినంతనే ఆఫ్ఘ నుకాలీ కొకజాగీరు నిచ్చి, పలువిధముల గౌరవించెను. నిజముగ మెహరు న్నీసా నెట్లయిన వివాహమాడ యత్నించినవాడైనచో జహాంగీరు షరా ఫ్ఘనునితో నింత యుక్తి విహీనముగ మెలగియుండునా? అన్నిటి కంటె ముఖ్యమగువిషయము మరియొకటి కలదు. నూర్జహానువంటి అభి మానవతి, తనభర్తను జంపించిన దురాత్ముని వివాహమాడుటకును, నాతనితోకలిసి సపర్యలొనర్చుటకును నొప్పుకొను పౌరుషహీనురాలు కాదు. జహాంగీరును వివాహమాడిన పిమ్మట, వారి యనోన్యానురాగముల ప్రతిచరిత్రకారుడును వేనోళ్ల బొగడియున్నాడు. ఆత్మగౌరవముగల యొకయువతి, యందును మెహరున్నీసా, భర్తృహంతకు నట్లు ప్రేమించుటయు, గౌరవించుటయు నచింతనీయము. ఈ విషయముల నెల్ల జర్చించిచూడ జహాంగీరు మెహరున్నీసా యెడ గల మోహావేశ మున షరాఫ్ఘనుని జంపించెనను కొందరాంగ్లేయ చరిత్రకారుల యభి ప్రాయము కేవల మసత్యమని స్పష్టమగుచున్నది.

అటులైన, మెహరున్నీసాను దవగుదెచ్చియిచ్చుటకే జహాంగీరు కుతుబుద్దీనును, నియోగించెనను స్వకపోలకల్పితములగు యూహాలప లోనైయున్నారు. కాని యీయూహాల కే విధమగు నాధారమును గన్పింపదు. ఇంతకుముందే వంగదేశమునకు రాజప్రతినిధిగ నున్న రాజామాన్సింగును, సలీమును కలహించియుండిరి. అక్బరుచెంతలో వారలకు

సంధి కుదిర్చెను. కాని అక్బరు మరణించిన కొద్దికాలములోనే జహంగీరు మానసింగు నుద్యోగపదవినుండి తప్పించుట స్థిరము. 'సేనా, సేపో'యను విషయమమాత్ర మవమానము, ఖుస్రూ తిరుగుబాటు నణచివేయబడినంతకే, జహంగీరు మానసింగు నుద్యోగమునుండి తీసివైచెను. ఆయుద్యోగమునకు జక్రవర్తి కనుకూలుడును, విధేయుడు నగువాడెవడో నియమింపబడు ననుట నిర్వివాదాంశము. అట్లే చక్రవర్తికి గడుంగడు ననుకూలు డగు కుతుబుద్దీను వంగదేశపు రాజప్రతినిధిగ నియమింపబడెను. అంతియేకాని, కేవలము నూర్జహాను నపహరించు నుద్దేశ్యముతో జహంగీ రాతని, నియమించియుండలేదు.

ఇక వారికొందరు షరాఫ్ఘను రాజభక్తి ననుమానించుట, చక్రవర్తికి బాడికాదనియు, సహేతుకముగ లేదనియు, కేవల మన్యాయముగ దోచుచున్నదనియు జెప్పెదరు. కాని, యిందుగూడ నాశ్చర్యకరమగు విషయ మెద్దియు లేదు. ఏలయన నీసమయమున వంగదేశము రాజకీయాందోళనమునకును, వల్లరులకును, తిరుగుబాటులకును, మూలస్థాన మైయుండెను. ఇంతకుమున్నే ఉస్మానొక తిరుగుబాటు గావించెను. ఎటుజూచిన నల్లరులు ప్రబలియుండెను. అల్లరు లంటుజాడ్యమువలె నలుదిశల వ్యాపింప దొడంగెను. అట్టితరి జక్రవర్తి కడు జాగరూకతతోడను, మెలకువతోడను, సంచరింపవలసియుండెను. ఈ సందర్భమున నొకమారు తిరుగుబాటు గావించిన యొకపారసీకయువకుడగు షరాఫ్ఘను మరల తిరుగుబాటు గావించు నేమో యను ననుమానము మానవుడను ప్రతివానికిని జనింపకమానదు. అందుచే నట్టి యల్లరులేవియు రాకుండజేయుటకై షరాఫ్ఘనుని మరియొకచోటుకు మార్చు నుద్దేశ్యముతో ఢిల్లీకి నాతనిని జక్రవర్తి పిలిపించుటయందును వింత యేమియు లేదు. ఇక విషాదకరములగు షరాఫ్ఘను, కుతుబుద్దీను మొదలగువారి మరణములు, షరాఫ్ఘనుని పెంకితనమువలనను, కుతుబుద్దీనుని యుక్తివిహీనతచేతను సంభవించెనుకాని, జహంగీరుప్రేరణ మిందు లేశమాత్రమైన లేదు.

భర్త మరణింపగనే భార్య సహజముగ దనపుట్టినింటివారికడ కేగునుగదా! అధర్మము ననుసరించియే, మెహరున్నీసా తనసోదరుడును, తండ్రియు నుద్యోగము జేయుచున్న ఢిల్లీనగరమునకు గొంపోబడెను. ఢిల్లీ ప్రవేశించిన తరువాత రాజమాత పరిచారికగ నుండుటయందును, హఠాత్తుగ జక్రవర్తి కంటబడుటయందును, దనను పరిణయమాడుటయందును నాశ్చర్యజనకమగు విషయ మెద్దియు లేదు.

జహాంగీరుని మరణానంతరము రెండు శతములు గడచిన వెనుక శృంగారమగు కథయొండు జహంగీరు మెహరున్నీసాల వివాహమునుగూర్చి కల్పింపబడెను. మహమ్మద్ సాదిక్ తబ్రీజీ, ఖాఫీఖాన్, షజనరాయ్, మొదలగు మరికొందరు చరిత్రకారు లీకథను బ్రాముఖ్యమునకు దెచ్చిరి. సలీము మెహరున్నీసాలు బాల్యమున గలసి యాడుకొనెడివారనియు, వయసువచ్చినపిమ్మట నొకనాడు సలీము మోహావేశమున మెహరున్నీసాను దన బాహువుల బంధించెననియు, నామె రొట్లో విడిపించుకొని యంతఃపురకాంతల కీయుదంతము నెరుగజెప్పెననియు, నక్బ రీసంగతి విని తనకుమారు డామెను వలచుట కిష్టగింపక యామెను షరాఫ్ఘనున కిచ్చి వివాహముజేయించెననియు, గొంతకాలమునకు (జహాంగీరు చక్రవర్తియైన పిమ్మట) దాను బాల్యమునుండియు ప్రేమించెడి మెహరున్నీసాను దనకు దెచ్చియప్పగించుటకై కుతుబుద్దీనుని నిరోగించెననియు, షరాఫ్ఘను కీరహస్యము తెలిసి తన జాగీరునకు వెడలిపోయె ననియు, నటుపిమ్మట రాజభటులకును షరాఫ్ఘనునకును జరిగిన ద్వంద్వయుద్ధమందు జీవములతో బయటపడి యంత్యకాలమున దన భార్యనుగూడ దునుమట్టింప నామెగృహమున కేగననియు, నంత నాతని యత్తగారు గుమ్మమున కడ్డముగ నిలచి, మెహరున్నీసా లోన నాత్మహత్య నొనరించుకొనె నని చెప్పి యాతని మోసగించెననియు, వందులకు దృష్టికెంది యాతడు మరణించె ననియు వ్రాసియుండిరి. ఈగాధ వెంటనే కార్చిచ్చువలె దేశమంతట నలముకొనెను. 17వ శతాబ్దపు ప్రథమవత్సరమున నెవరు నెరుంగని యీయసత్యగాథ శతాబ్దాంతమున బ్రతియాత్రికుని చరిత్రయందు నెక్కెను. పారసీక చరిత్రకారులు కొందరీ యుదంతమున కనేకవన్నెచిన్నెలగూర్చి యానందకరముగ దయారుచేసియున్నారు. రసపుత్రకవులు నిజచరిత్రను జాట ప్రయత్నించినట్లు గన్పించును. కాని ఇటలీదేశపు యాత్రికుడగు మేనుక్కి యీగాధ కింకను గొన్ని యూహాపోహల గల్పించి కడు రసవంతముగ నొనర్చెను.

18వ శతాబ్దమున నిజచరిత్ర నెవరును దెలిసికొనకుండునంతటి నైపుణ్యముతో, డౌ మొదలుగాగల యాత్రికు లావిషయమును మహా రసవంతమగు నొక నాటకకథవలె తయారుచేసిరి.

19వ శతాబ్దమున ఎలిఫిన్‌స్టన్, ఖాఫీఖాన్ వ్రాతల నాధారముగ గొని, దేశదేశముల నీయసత్యగాథను జాటియున్నాడు. ఈచరిత్రకారుల యుదంతమును గట్టిపెట్టి, సమకాలికుల వ్రాతల నాధారముగ గొని చర్చించితిమేని జహంగీరు నూర్జహానుల నిజస్వచ్ఛచరిత్రలు బయల్పడగలవు.

## నూర్జహాను స్వభావశీలములు

ఆమె రెండవ వివాహ మగునప్పటికి ముప్పదినాలుగేండ్ల ప్రాయము గడచినను, నూర్మహల్ (అంతఃపురజ్యోతి) లేక నూర్జహాన్ (భువనైకజ్యోతి) యను నామములచే ప్రసిద్ధిగడసిన మెహరున్నీసా, తన సహజ సౌందర్యము నిసుమంతేనియు గోల్పోలేదు. సౌందర్యవిషయమున నామెకు లోటేదియు గాన్పింపదు. పారసీకదేశపు సహజసౌందర్య విలాసమున కొకవింతసోయగము, కాంతి, చిదానందస్వరూపము, అత్యద్భుతబుద్ధికుశలతచేరి యామె నొకయపూర్వవ్యక్తిగా నొనరించెను. అనేకచిత్రకారు లామెరూపమును జిత్రించి తరతరములుగా నామె స్వరూపవిభవవిలాసాదుల నానందింప నవకాశ మొసంగియున్నారు. "పల్లవసదృశ మగు శరీరసౌకుమార్యము, గోలముఖము, విశాలనయనములు, ముద్దులొలుకు చిన్నిపెదవులు, విశాలఫాలభాగము నామెసౌందర్యమునకు వన్నె దెచ్చె"నని కొందరు చరిత్రకారులు వర్ణించియున్నారు ఆమెశరీర మారోగ్యవిషయమున గడుంగడు ప్రశంసనీయ మైనది,

కృతమాయెను. దినదినము నామె కనుధనము వృద్ధియాయెను. మానవుల కధికారవాంఛకన్న మిన్నయగున దెద్దియు గాన్పింపదు. అట్టి సర్వ రాజ్యాధిపత్యమును నూర్జహాను తనయరచేత నిరికించికొన్న సమయమం దాశ్చర్య మేమియు లేదు.

### జహాంగీరు రాజ్యమున నూర్జహాను స్థానము

నూర్జహాను రాణి యైనంతనే, యామె బంధువు లెల్ల రున్నత పదవుల నియోగింపబడిరి. ఆమె తల్లియగు అస్మత్ బేగమున కంతఃపురమున మితిలేని యధికారమును గౌరవమును లభించెను. ఆమె తండ్రి మిర్జాఘియస్ బేగు ఢిల్లీ సామ్రాజ్యమున నంతటను గొప్ప యుద్యోగి యాయెను. కాని, వీరిరువురు జీవించియుండినంత కాలమును, దమకొమారితకు వలయు సలహాల నొసగుచు గ్రోధ, మద, మాత్సర్యములవలన గలుగు నుద్రేకముల నెల్ల దమశక్తివంతయు వినియోగించి, యణచుచు, నామె సద్గుణములకు మరింత వన్నె దెచ్చిరి. ఆమె సోదరు లిరువురును గూడ నున్నతపదవులను బొందిరి. వారిరువురి యందును అసఫ్ ఖా నధిక గౌరవము బొందెను. అసఫ్ ఖాముని కొమారితయగు అర్జుమనుబాను బేగమును, నూర్జహాను, జహాంగీరు కుమారులయందెల్ల నుత్తముడు, నిపుణుడు నైన ఖుర్రమున (షాజహాను) కిచ్చి వివాహ మొనరించెను. ఈ అర్జుమనుబాను బేగమే, ఖుర్రము పాదుషా యైనతరువాత ముంతాజమహాలను నామముతో ప్రఖ్యాతి వహించిన వారిశిరోరత్నము. వివాహకాలమునకు ఖుర్ర మిరువదిసంవత్సరముల ప్రాయమున నుండెను. అప్పటికే రాజ్యతంత్ర ప్రవీణుడై జహాంగీరు చక్రవర్తి కుమారులయందెల్ల శక్తిసామర్థ్యములు గలవాడని ఖుర్రము మన్నన వహించెను. జహాంగీరు మరణించిన తరువాత సింహాసన మధిష్ఠించుట కాతడే తగియుండెను.

చక్రవర్తికి బట్టపురాణి యైనంతనే, రాజ్యపాలనాభారమంతయు నూర్జహాను స్వతంత్రముగను, స్వయముగను వహించెను. ఆకాలమున దానే స్వయముగ సింహాసన మధిష్ఠించి, న్యాయసభల నలంకరించి, రాయబారులతో స్వయముగ మాటాడి, యుద్ధసంధివిషయముల దానే చర్చించుకొని రాజ్యపాలన జరిపెను. నాణెములపై గూడ నామె నామమే కాన్పింపజొచ్చెను. సర్వరాజ్యాధిపత్యమును దనహస్తముల నిముడ్చి, యతినిపుణముగ, దనతల్లిదండ్రుల సహాయమున, నల్లకల్లోలములు గలుగకుండ బాలించెను. తాను రాజ్యభారము వహించిన 1611 వ సం॥ము మొదలు 1622 వ సం॥ము వరకు శాంతియుతముగ నడచిపోయెను. కాని 1622 వ సం॥ముతో బరిస్థితులు మారజొచ్చెను. నూర్జహాను బంధువు లెల్ల రున్నతస్థితికి వచ్చుట, చక్రవర్తి కామెపైగల విశేషాదరము, నన్నిటిని మించిన యామెయధికారమును గాంచి సహింపజాలక సామంతులు కొందరు మాత్సర్యపూరితులై యామెయధికార మణగింప యత్నించిరి. అట్లు తిరుగుబాటుగావింప యత్నించువారి యందు మహాబత్ఖాను ప్రముఖుడాయెను.

మహాబత్ఖాను జన్మచే రాజపుత్రు డయ్యు నున్నతోద్యోగవాంఛచే మహమ్మదీయు డాయెను. కాని శౌర్యస్థైర్యముల నెనలేనివాడై రసపుత్రమహమ్మదీయుల కిరువురకు నాదర్శప్రాయుడై యుండెను. అనేకమార్లు మహాబత్ఖాను, జహాంగీరును, నూర్జహాను కంతటి యధికార మీయవలదని యనేకవిధముల మందలించెను. కాని జహాంగీ రాతని వాక్యముల నన్నిటిని చెవిని బెట్టెను. అందుచే మహాబత్ఖాను విసుగుజెంది ఖుర్రముతో గలసి యాతనికి బట్టముగట్ట నిశ్చయుడాయెను. ఇందు మూలమున మహాబత్ఖాను నూర్జహానులకు వైర మధికమాయెను.

ఇంతలో రాజ్యపరిస్థితు లన్నియు మారెను. పర్షియాచక్రవర్తి ఖాందహారు నాక్రమింప యత్నించుచుండెను. ప్రాక్పశ్చిమతీరములందు పోర్చుగీసువారి దుర్నయము లధికమాయెను. మక్కాకు బోయెడి యాత్రికుల నడ్డగించి వారిధనముల నెల్ల గొల్లగొట్ట మొదలిడిరి. ఒక సమయమున చక్రవర్తి నావలనుగూడ నడ్డగించి సుమారు మూడులక్షల విలువగల యాస్తిని స్వాధీన మొనర్చుకొనిరి. అందున, నూర్జహా నాంగ్లేయవాణిజ్యాధిపతి యగు డౌన్టను సహాయమును బడసి పోర్చుగీసువారి నోడించెను. ఆనాటినుండియు పోర్చుగీసువారి బలము క్షీణింప, ఆంగ్లేయులు వృద్ధిగాజొచ్చిరి. ఆంగ్లేయులు సూరత్ మొదలగు పట్టణముల వర్తకశాలలను కోటలను నిర్మించుకొని తమబలము నభివృద్ధిపరచుకొన మొదలిడిరి. ఆంగ్లేయులకు సదుపాయములు గలుగజేసి వారి నభివృద్ధికి దెచ్చిన దనసామ్రాజ్యమునకే మోసము కలుగుట తప్పదని నూర్జహాను గ్రహించి 1616వ సం॥మున పోర్చుగీసువారితో సంధి గావించుకొనెను. ఈసమయముననే వంగదేశమున ఉస్మాను అను నాఫ్ఘనులు తిరుగుబాటు గావించి యల్లకల్లోలములకు మూలకారకులైరి. అందుచే వారి నణచుటకై నూర్జహానుతో షరుహూ లను రసపుత్రనాయకుని బంప నతనాయాందోళనము నణగద్రొక్కెను. కాని వెనువెంటనే అఫ్ఘనప్రముఖులకు కొంచెము కన్నతోద్యోగముల నొసంగి గౌరవించుటచే నూర్జహానుపై వారికి భక్తివినయము లధికముగా నుదిరెను. ఇట్లాఫ్ఘనుల సాధువుల నొనరించి తనయనుచరులుగ నొనరించుకొనుటయందు నూర్జహాను చూపిన రాజ్యతంత్రప్రావీణ్య మనుపమానము.

అప్పటినుండియు నూర్జహాను చరిత్రయంతయు మహాబత్ఖానుతోడను, ఖుర్రముతోడను వైరములతో నిండియుండెను. 1616వ సం॥మున దక్షిణదేశమున అహమ్మదునగరు బీజపూరుల జయించుటకై నూర్జహాను ఖుర్రమును బంపెను. ఖుర్రము దక్షిణాపథము బ్రవేశించినంతనే జయలక్ష్మి యాతనిని వరించెను. తనకు పూర్వ మంపబడిన యుద్యోగుల నెల్ల నోడించిన మాలికాంబరును గడగడ నడకించి సంధి కుదుర్చుకొనెను. బీజపూరుసుల్తాను హృదయమున భీతిగలిగించి, తనకు లాభకరమగు షరతులతో సంధిగావించుకొనెను. దక్షిణదేశమందు షాజహాను నధికారము, పలుకుబడియు నంతకంత కధికము గాజొచ్చెను. ఈవిషయము గ్రహించినంతనే నూర్జహా నసూయాపూరితురాలాయెను. ఖుర్రమున కధికార మధికమైనచో సైన్యముల గూర్చుకొని జహాంగీరు నోడించి యాతని జీవితకాలమందే సింహాసన మాక్రమించి యితరసోదరుల నెల్ల నేలమట్ట మొనరించునేమో యను భయ మామె

వానరించెను. జహాంగీరు కడపటి కుమారుడగు షహారియారునకు, నూర్జహాను, తనకు షరాఫ్ఘనునివలన గలిగిన కొమారితె నిచ్చి వివాహము గావించి యుండుటచే వానికే పట్టముగట్ట నిర్ణయించుకొనెను. అన్నిటికంటె నధికముగు తనయధికారమే తగ్గిపోవునేమో యను భీతి యామెను బీడింపజొచ్చెను. ఈసమయమునకు మున్నే యామె తలిదండ్రులు మరణించిరి. అంతుమూలమున నామె మహాబత్ఖానునితో సంధిగావించుకొని, యాతనిని దన మాయోపాయములచే దనవంకకు ద్రిప్పికొని ఖుర్రమున కధికారాధిక్యత కలుగకుండ విశ్వప్రయత్నము లొనరింప మొదలిడెను.

ఇట్టిసమయమున నక్కటులుండి జహాంగీరు రోగపీడితు డాయెను. జహాంగీరు మరణించిన, ఖుర్రము రాజ్యమునకు వచ్చిన, దనగతి యేమగునో యనుభీతి యామెను బీల్చి పిప్పిచేయ మొదలిడెను. ఎటులైనను ఖుర్రమును సింహాసన మధిష్ఠింపకుండజేసి, తనయల్లుడగు షహారియారునకు బట్టముగట్ట నిర్ణయించుకొనెను. జహాంగీరు రోగపీడితుడుగ నున్న వార్త వినినంతనే ఖుర్రము ఖుస్రూను జంపించివైచెను. ఖుస్రూమరణము నాధారముగగొని నూర్జహాను, జహాంగీరు మనస్సున ఖుర్రముపై నసూయబుట్టించి ఖుర్రము నతని కాధారభూతమగు దక్షిణదేశమును విడచి ఖాందహారునకు రాజప్రతినిధిగ బోవునట్లు నియమించెను. కాని ఖాందహారునకు బోవుటకు ముందు ఖుర్రము నాలుగుమరతులు గోరెను. మొదటిది సర్వసేనాధిపత్యమును దనకే యొసంగుట, రెండవది, పంజాబు దేశమంతయు దన కిచ్చివేయుట, మూడవది, తనకుటుంబరక్షణ నిమిత్తమై రణథంభపురము నాతని స్వాధీన మొనర్చుట. నాలవది, వర్షాకాలాంతమువరకు దన్ను దక్షిణదేశమందే యుండనిచ్చుట. ఈ తుది కోరికయం దాతని యభిప్రాయ మేమన, దక్షిణదేశమును వీడునంతలో దక్షిణమున దన యధికారము స్థిరముగ స్థాపించుకొనుటయే. ఈవిషయమునంతయు నాలోచించినంతనే చక్రవర్తి కుమారుని ప్రవర్తనకు విసుగుజెంది తత్క్షణమే బయలుదేర వర్తమానమంపెను. పరిస్థితు లిట్లుండ, ఖుర్రము నూర్జహానుల పరిచారకులు కలహించి ద్వంద్వయుద్ధ మొనర్చుకొనిరి. ఇది యాధారముగ నొనరించుకొని ఖుర్రము దురుద్దేశ్యముతో నున్నట్లనుమానించి చక్రవర్తిచే ఖుర్రముస్వాధీనమం దుత్తరదిశనున్న పరగణాలనన్నిటిని స్వాధీన మొనర్చవలసినదిగా నాజ్ఞాపత్రి మంపించెను. అందుచే ఖుర్రము తన ప్రవర్తనకు బరితపించుచున్నటుల నటించుచు క్షమాపణపత్రి మొకటి తన తండ్రి కంపెను. కాని నూర్జహా నాయుత్తరము దెచ్చిన వార్తాహరుని జహాంగీరు కడకు బోకుండజేసి తనస్థితి గూర్చి విచారింపదొడంగెను.

ఆమెకు దోడునీడగ సహాయమొనర్చిన తలిదండ్రులు చనిపోయిరి. తనసోదరు డగు అసఫ్ఖాను నమ్మదగియుండక యటునిటు జలింపజొచ్చెను. ఇక జేయున దేమియు గన్పించలేదు. కాని నూర్జహా నంతటితో విడుచు ధీరువు కాదు. వెంటనే మహాబత్ఖానునకు వార్తనంపి, యాతని నత్యధికబిరుదములు, గౌరవములు మొదలగు వానితో సమ్మానించి, తనవశ మొనర్చుకొనెను. మహాబత్ఖాను కోరికప్రకారము, అసఫ్ఖా నాస్థానమునుండి పంపివేయబడెను. ఇక కార్యము మించిన దని యెరింగి ఖుర్రము తిరుగుబాటు గావించెను.

ఖుర్రమునకు దక్షిణదేశమందలి ప్రభువులెల్లరు సాయ మొనర్చిరి. అతడు సైన్యసమేతుడై 1628వ సం॥ మున ఆగ్రానగరమును జేర్చెను. నూర్జహాను సర్వసైన్యాధిపత్యమును మహాబత్ఖానుని హస్తమునం దుంచెను. బిలోచ్పూరనుచోట నిరుసైన్యములును గలసికొని ఘోరయుద్ధ మొనరించుకొనిరి. అందు ఖుర్ర మోడింపబడుటయేగాక, యాతని దక్షిణహస్తమగు విక్రమాదిత్యుడు హతుడాయెను. తన సైనికులు కూడ నాతని విడువజొచ్చిరి. ప్రాణరక్షణార్థమై అక్బరు కోటకు ఖుర్రము పలాయనుడాయెను. మార్గమధ్యమున తిరుగ నూర్జహాను సైన్యములచే రెండుమారు లోడింపబడెను. చేయునది లేక, ఖుర్రము ఆసమ్మానగరమున మాలికాంబరు శరణముజొచ్చెను. అంతటితో మహాబత్ఖాను వానిని వెన్నంటుట మాని, వంగదేశమును జయింప మొదలిడెను. బంగాళమును నాక్రమించి, రోహాలుసెల్ల రాజమహాలనొద్ద నోడించి క్రమముగా వంగదేశము, ఒరిస్సాదేశము నాక్రమించుకొనెను. అలహాబాదు, జౌన్పూరులకూడ స్వాధీనపరచుకొనెను. మరల ఖుర్రము వంకదిరిగి యాతనినోడించెను. అటుపిమ్మట మాలికాంబరు నగరింప మహాబత్ఖాను బీజపూరు సుల్తానుతో గూడి విశ్వప్రయత్నము లొనరించుచుండెను. ఈసమయమున ఖుర్రము శరీరమందు రుగ్మత ప్రవేశించెను. అందుచే, ఖుర్రము, మరణమునకు సిద్ధముగనున్న తనతండ్రి కొక క్షమాపణపత్రి మంపెను. చక్రవర్తి శయ్యపైనుండి లేవజాలకుండుటచే నాపత్రిమ నూర్జహాను హస్తముల బడెను. మహాబత్ఖానుని యధికారము నానాటికి వృద్ధిగాంచుట నూర్జహానున కిష్టములేకుండెను. అందుచే నామె ఖుర్రము క్షమాపణ నంగీకరించి, యాతనిని దనపక్షమున జేర్చుకొనెను.

మహాబత్ఖానునకు, ఖుర్రము రాజ్యమునకు వచ్చుట యిష్టము లేదు; ఎట్లైనను పర్వేజాను, సింహాసన మెక్కించి, తన యధికారమును నిరంకుశముగ నాటుకొన మహాబత్ఖాను యత్నించుచుండెను. నూర్జహాను, తనయల్లుడగు షహారియారునకు బట్టముగట్ట నిశ్చయించెను. షహారియారు రాజ్యమునకు వచ్చినా, మహాబత్ఖానునకు లేశమాత్రమైన నధికారముండుట కవకాశము లేదు. అందుచే నూర్జహానుపై మహాబత్ఖానున కసూయ యధికమాయెను. ఒండొరుల మనములు కలియనప్పు డెంత స్వల్పవిషయమైనను ఘనము, నాక్రోశము దెచ్చుట సహజమేకదా! ఈసమయముననే మహాబత్ఖానుని యల్లుడొక తప్పిద మొనరించి, క్షమాపణ వేడుటకై యాస్థానమున కేగ నచట యతి యవమానపరుపబడెనట. ఈ యవమానమును సహింపలేక మహాబత్ఖాను తిరుగుబాటు గావించి సైన్యముల గూర్చుకొని యుద్ధసన్నద్ధు డాయెను. శరీర మస్వస్థతగ నుండుటచే, పంజాబుదేశమున నారోగ్యముగ నుండునని యెంచి, చక్రవర్తి యచట నివసించుచుండెను. మహాబత్ఖాను వెంటనే పంజాబునకు సైన్యసమేతుడై యచటి చక్రవర్తిని ముట్టడించెను. సామ్రాజ్ఞి, తనపరివారముతో బాటు నదినిదాటి యావలిగట్టునకు బోవుచుండగా నీవలివైపున దాటుటకు సిద్ధముగనున్న చక్రవర్తిని మహాబత్ఖాను చుట్టుముట్టి పట్టుకొనెను. నూర్జహానుమాత్ర మావలిగట్టునకు జేరిపోయెను. చక్రవర్తి మహాబత్ఖానుచే బంధితుడైనవార్త వినినంతనే, యామె మహాబత్ఖానునితో

# తూము లక్ష్మీనరసింహదాసు

మిన్నికంటి గురునాథశర్మ గారు

౧

శ్రీరామ రామ యనుచు న, వారత మత్యంత పావన స్థిరభక్తి
ప్రేరణఁ బఠించు పుణ్యుఁడు, దారుని తూము నరసింహదాసు విదలఁచుక్.

ఐహికభోగాసక్తుల పాపకర్మాచరణముచేఁ బ్రాచ్యులకును భగవద్భక్తి సన్నగిల్లుచున్నది. హేతువాదములు మెండగుచున్నవి. ప్రత్యక్షప్రమాణమే ముఖ్యమగుచున్నది. "ఆత్మని త్వరిత్వభూతాని" యన్నట్లు కించిజ్ఞులగు తా నమ్మిన మహామాత్రికయుముల నమానుష కార్యములఁ సందేహించి తిరస్కరించుచున్నారు. "మురారేస్తృతీయః పంథా" యన్నట్లు విపరీతమైనను నవీనమార్గము ప్రోత్సాహకరమై నాస్తికత ప్రబలుచున్నది. అనుయాయులుఁ దోడగుచున్నారు. కావున ధర్మతాంత్రికములు విజృంభించుచున్నవి. పూర్వమువలె నేఁడు భారతమాత భగవద్భక్తులఁ గడుపునిండఁ గనఁజాలకున్నది. అట్లయినను, ఏదేవుని సేవించిన నేమి? ఏ మంత్రము నుపాసించిన నేమి? ఏ యోగము నవలంబించిన నేమి? వేమనయోగి, రామదాసు, తుంగదుర్తి బుచ్చయ్య, తూము లక్ష్మీనృసింహదాసు, త్యాగరాజు, బ్రహ్మముగారు, సిద్ధప్ప, నారాయణగారు, పరశురాముల నరసింహదాసు, వావిలికొలను సుబ్బారావుగారు మొదలగు భక్తవర్యులు నేఁటికిని బూజింపఁబడుచున్నారు. చిన్న పెద్ద మాత్రము కన్నులు తెరచి వేమన యోగినిగూర్చి పరిశీలించుచున్నారు. త్యాగరాజుని దలఁచుచున్నారు. కాని మిగిలిన భక్తవర్యుల చరిత్రముల సమగ్రముగఁ బరిశోధించుచున్నట్లు కన్పింపదు. "భక్తవిజయము" వ్రాయఁబడిన గ్రంథము మాత్రము మహారాష్ట్రభాషాగ్రంథమూలకమగుటం జేసి ఆంధ్రదేశభక్తుల చరిత్రములందుఁ జేరదయ్యె. ఆంధ్రభక్తుల చరిత్రమును రచించుటకు 'ఆంధ్రవాల్మీకి' శ్రీయుత వావిలికొలను సుబ్బారావుగారు పూనుకొనెద మని యొకమారు తెలిపియుండిరి. ఎవరెట్లుగాని భక్తులనుగూర్చి వారు ప్రకటించుట సముచితమని నేనొక వ్యాసమును వ్రాయఁబూనితిని.

భక్తిలత కాలవాలమును సంగీతసాహిత్యముల కునికిపట్టును ప్రసిద్ధమును బవిత్రమును నగు "తూము" వంశమున లక్ష్మీనృసింహదాసుగారు క్రీస్తుశకము 1790 ప్రాంతమున నప్పయాఖ్యునకును వెంకమాంబకును నవతరించిరి. వీరు గోల్కొండ వ్యాపారులు. ఆపస్తంబసూత్రులు, యజుశ్శాఖాధ్యయనులు. వసిష్ఠశక్తి పరాశర త్రయార్షేయులు, పరాశరగోత్రజులు.

లక్ష్మీనృసింహదాసుగారి తాతగారు వేంకటకృష్ణయ్యగారు. వీరు గుంటూరుమండలమునందలి పొన్నూరు గ్రామమున నివసించుచు భావనారాయణస్వామిని సేవించుచుండిరి. వీరికి కప్పయాఖ్యుండు జనించి బాల్యముననే దేహబలమును వహించి రాజగౌరవము నొందెను. వేంకమాంబను పెండ్లాడి యే కారణమువలనో పొన్నూరును విడిచి గుంటూరు పట్టణము జేరి స్వగృహమును నిర్మించికొని కాపురముండెను. వారికి క్రమముగా నా పుణ్యదంపతులకు మన లక్ష్మీనృసింహదాసు, కృష్ణదాసు నా రెండు పుత్రరత్నములును, రుక్మిణిబాయి యను పుత్రికయును జనించిరి. రుక్మిణిబాయిని గార్యాలవంశజున కిచ్చి పరిణయము నొనర్చిరి.

ఆ లక్ష్మీనరసింహదాసు, కృష్ణదాసు నుచితసంస్కారములంది యాంధ్రగీర్వాణవిద్యల నభ్యసించి రామభక్తులైయుండిరి.

పిదప సంప్రదాయానుసారముగ, సద్గుణమణి యగు "లక్ష్మీబాయమ్మ" ను లక్ష్మీనరసింహదాసు, సీతమ్మ యను బాలికను కృష్ణదాసు పరిణయమైరి. భగవద్భక్తశిఖామణి యగు మన యీ లక్ష్మీనరసింహదాసునకు సంతానము లేకపోయెను. సాధారణముగా భగవంతుఁడు తన దాసుల కోరకున్నఁ గొసంగకుండు నేమో!

ఈ భక్తుఁడు పరమపదముఁ జేరిన వెనుక లక్ష్మీబాయమ్మగారు మంగళగిరికొండను రామదాసనామునికిఁ జెంది వైదేహి యను కన్య నిచ్చి వివాహము చేసెను. వారలును నిస్సంతానులైరి. వైదేహమ్మయు భర్తృమరణానంతరము తూము లక్ష్మయరాయ నామునిఁ బెంచుకొనిరి. అతని కొడుకు గోపచంద్రుడు భద్రాద్రి పేటలో గలరు.

మన లక్ష్మీనృసింహదాసుగారు బాల్యమునుండియు రామభక్తులై నడచుచున్నను నడుగడుగునకు రామరామ యనియును, మాటలాడుచున్నను మాటమాటకు రామరామ యనియు మదిలో ననుకొనుచుండువాఁడు. పుత్తడి పుట్టుకతోడనే పరిమళించును.

తన కిర్వదేండ్లు వచ్చినపిదపఁ దండ్రి స్వర్గస్థుఁడాయెఁ గటా. భార మధికమైకలంపఁ బొన్నూరులోఁ దేమ్యాడు వేతనమున దినముల



శ్రీ ముత్తైన్ కన్యగారు



శ్రీ కమలామీనన్ కన్యగారు



క్యాంప్ బెల్ హారిస్ సతిగారు



భారతమహిళాసమాజము, అబలాజన పఠనమందిరము—గుంటూరు
ఆర్. యస్. శ్రీకృష్ణస్వామి అయ్యంగారిసతి కాలమ్మగారికి ఫేర్వెల్లిచ్చిరి

మార్గములను బోధించుచున్నట్లు తెలుపు చిత్రము కలదు. రెండవది బుద్ధునియవతారకథ—బుద్ధుడు తెల్లయేనుగరూపమున తుషితస్వర్గము నుండి దిగివచ్చినట్లు బౌద్ధులు చెప్పెదరు. మనకిందుగాన్పించు వెల్లయేనుగు బుద్ధుడే—భూలోకమున జన్మింప నవతరించుచున్నాడు. ఆ శ్వేతగజమును కుబ్జగణములు మోయుచున్నారు. దేవగంధర్వులు పరివేష్టించి వచ్చుచున్నారు. ప్రభులాంఛనములైన ఛత్రచామర ధ్వజములను పట్టుకొని కొందరు ఆ తెల్ల యేనుగును దరుముచున్నారు. దివ్య నృత్త గీత వాద్యములు చెలరేగుచున్నవి. కొంద ఱాడుచున్నారు. కొందరు అభినయించుచు పాడుచున్నారు. మఱికొందరు జంత్రవాద్యములు వాయించుచున్నారు. జగద్వ్యాధినివారణ కార్యమునకై బుద్ధు డవతరించుచున్నాడని అంతయును ఆనందమే. మూడవదిభాగమున మాయాదేవి స్వప్నవృత్తాంతము తెల్పబడినది. శుద్ధోదనుని పట్టపుదేవియైన మాయామహాదేవి చక్కని శయ్యపై పరుండి నిద్రించుచున్నది. ఆ మెత్తల్పము నాలుగుమూలల చతుర్దిశలను పాలించు దిక్పాలకులు నిలుచుండియున్నారు. పర్యంకమున క్రిందనట్టు ఆమె పరిజనము కొందరు కూర్చుండియున్నారు; కొందరు నిలుచుండియున్నారు. పర్యంకమున క్రిందనున్నవారిలో నిరువు రామెకు వీవనలు వీచుచున్నారు. స్వర్గమునుండి యొక వెల్లయేనుగు వచ్చి తనగర్భమున ప్రవేశించుచున్నట్లు ఆమె కలగాంచుచున్నది. మాయామహాదేవి స్వప్నము, బుద్ధునిజన్మము—వీటికి సంబంధించిన చిత్రములు అమరావతీస్తూపమున పెక్కుకొల్ల కలవు.

మూడవ చిత్రమున కనబడునది ప్రాకార శిలలోని అడ్డ దూలములమీది నృత్తచిత్రములు. వేఱువేఱు విధములైన కల్పనలతో ఇందు "త్రిశూల" చిహ్నము చిత్రితమైనది. ఈ త్రిశూలము సాధారణముగ జ్వాలాస్తంభమునకు మకుటముగ నుండును. త్రిశూలాధిష్ఠితమైన యీ స్తంభము సాధారణముగ నొక సింహాసనము వెనుక నుండును. ఈ స్తంభమునకు కుడియెడమవైపుల నూర్ధ్వగతిని జ్వాలలు ప్రసరించుచున్నట్లు చూపుదురు. ఈ జ్వాలాస్తంభములు ఒక్క యమరావతిలో తక్క ఉత్తరహిందూస్థానమునందలి స్తూపములలో నెచ్చటను గానరావు. అంతేకాక బౌద్ధకళ ప్రారంభదశయందు గూడ వీటి "అజాపొడా" ఎచ్చటను గానరాదు. ఇదివరకున్న చిత్రితమైన బౌద్ధ సంజ్ఞావళి(Symbols)కి అమరావతి ప్రత్యేకముగ కనిపెట్టి రూపొందించిన విచిత్రోపాయ మీ జ్వాలాస్తంభము. ఈ నృత్తమునందలి కుడివైపు ఎడమభాగము పాడగుటవలన అచ్చటనుండిన చిత్రవిశేషము లేదియో మనకు తెలియవచ్చుట లేదు. నృత్తము మధ్యభాగమున త్రిశూలాధిష్ఠితమైన జ్వాలాస్తంభము ముందు సింహాసనమున్నది. ఈ సింహాసనము మీద "అవశేష" పూర్ణములైన కంద్రవి కగిలమ్ములో ఏవో యుంచబడినవి. ఇవి రెండుభాగములుగ గాన్పించుచున్నవి. క్రిందిది కరండము యొక్క యడుగుభాగమును, పైది తెఱచియుంచిన పై మూతయును నగు నేమో. దీనిపై 'స్వస్తిక' చిహ్నము కలదు. దీనికి కుడివైపున బౌద్ధభిక్షువు లీకరండమునకు నమస్కరించుచున్నారు.

సింహాసనమునకు దిగువ నొక వేదికపై బుద్ధభగవానుని శ్రీపాదములు కలవు. వాటికి ముందు వినమ్రులై యిరువురు స్త్రీలు ప్రణమిల్లుచున్నారు. సింహాసనమున కెడమభాగమున దేశీయములైన యుడుపులను ధరించిన యొక ప్రభువు తనకుమారుని కరండసమీపమునకు గొనివచ్చి దానికి 'మొక్కుబడి' చెల్లించుచున్నాడు.

ఆప్రభువెనుకనున్న వారందరు ఆతని కుటుంబమునకు సంబంధించినవారు కావచ్చును. ఈ స్త్రీలు ధరించిన బంగారు జడలను, తలపూవులను, మువ్వల మొలనూళ్ళను, హస్తాభరణవిశేషములను గమనింపదగినవి. మఱియొక్క విషయము. కుడివైపుననున్న బౌద్ధభిక్షువులు కుళ్ళాయిలు ధరించియున్నారు. ఈ కుళ్ళాయియొక్క వెనుకవైపు దిగువ భాగము ఎంతక్రిందికి సాగిన దానిని ధరించినవా రంతటి విద్యాధికుడట. అనగా విద్యాధికత ననుసరించి యీ కుళ్ళాయి వెనుకభాగము తిన్నగ హెచ్చుచుండునని తెలిసికొనవలసియున్నది.

నాలుగవ చిత్రమునగూడ మధ్యసింహాసనమును, దానిమీద "అవశేష"కరండమో ద్రోణమో, అడుగున, సింహాసనమునకు దిగువ వేదికను శ్రీపాదములును కలవు. దానివెనుక మూడవ చిత్రమునందు వలెనే జ్వాలాస్తంభము, త్రిశూలము కలవు. ఈ జ్వాలాస్తంభ, త్రిశూలములకుపైన ధర్మచక్రము కలదు. సాధారణముగా అమరావతీచిత్రములు వేటిలోను స్త్రీలు లేకపోలేదు; కాని యీనృత్తచిత్రమున మాత్రము ఒక్క స్త్రీయైనను లేదు. ఆరాధకులందఱును పురుషులే. తలకట్టుల ననుసరించియు, ఇతరలక్షణముల ననుసరించియు జూచినచో వారందఱు నొక్కతెగవారుగ కనబడుదురు. ఇక శ్రీపాదములకు రెండు ప్రక్కల రెండుజింకలు చిత్రితములగుటయే యిందలి విచిత్రము.

ఆరవచిత్రము కూడ త్రిశూలచిత్రమునకు సంబంధించినదే. ఇచ్చటకూడ నొకసింహాసన మున్నది. దానిమీద అవశేషకరండము లేదు కాని శ్రీపాదములున్నవి. సింహాసనమునకు వెనుకప్రక్క త్రిశూలాధిష్ఠితమైన జ్వాలాస్తంభము కలదు. ఈ త్రిశూలము బౌద్ధమతమున దేనికిగుర్తో ఎవ్వరును తృప్తికరముగ చెప్పియుండలేదు. త్రిశూలము, స్వస్తికము మొదలైనచిహ్నములు జున్నార్, భాజా, బెడ్సా, కుదా, కార్లీ మొదలైనగుహలలోని అత్యంతప్రాచీన శాసనముల ప్రారంభమునను, చివరను గానవచ్చుచుండుటచేత ఇది కడుప్రాచీన కాలమునుండియు అదృష్టచిహ్నములుగ వాడుకలో నుండినట్లు కొందరు చెప్పుచున్నారు. త్రిశూలము బౌద్ధమతమునకు సంబంధించిన చిహ్నముగాదేమో యని కొందరు ఇదివఱలో శంకించిరి కాని అమరావతీ స్తూపచిత్రములలో నిది తఱచు గానవచ్చుచుండుటచేతను, మూడవ చిత్రమున బౌద్ధభిక్షువులే దానికి నమస్కరించుచుండుటచేతను దానిని బౌద్ధమత చిహ్నముగానే పరిగణింపవలసి వచ్చినది.

ఈయారవచిత్రమున ఎడమభాగమునందలి ప్రధానారాధకులు నాగులు. సింహాసనమునకు కుడియెడమ ప్రక్కల తలయొకరు కూర్చుండి

యున్నారు. వీరిరువురికి తలమీద ఏకఃపడగ లున్నవి. వీరిరువురి పార్శ్వములు తలమీద ఒంటిపడగగల స్త్రీలు ఇరువురున్నారు. జ్వాలాస్తంభమున కిరుగెలంకుల చామరగ్రాహు లిరువురున్నారు. వారికి తలమీద పడగలు లేవు. ఇతరపరిచారకులును కొందఱు కలరు కాని వారికిని పడగలు లేవు.

ఈస్తూపచిత్రము మధ్యభాగమున సింహాసనము మీద కూర్చున్నవాడు నాగరాజు. ఇతని తలమీద తొమ్మిదిపడగలు కలవు. ఇతని రాణు లిరువురు ఇతనికి చెరియొక వైపున సింహాసనముమీదనే కూర్చున్నారు. రాణులకు కూడ నెత్తిమీద చెఱియొకపడగ కలదు. సింహాసనము వెనుక నాగరాజునకు రెండువైపుల నాగకన్యకలు వీచోపులిడుచున్నారు. వారికిని తలమీద ఒక్కొక్కపడగ గలదు. వీచోపులిడువారు మాత్రమే కాక మరి యిరువురు నాగకన్యలు కుడివైపున సింహాసనము వెనుక నిలువబడియున్నారు. వీరికిని తలమీద పడగ కలదు. వీరును రాణులపరిజనమే కావచ్చును. వీరితోపాటే ఎడమవైపు మరియిరువురు పరిచారకులు నిలుచుండి యున్నారు. నెత్తిమీద వీరికి పడగలు లేవు. నాగరాజునకు దూరమున ఇరుగడల నిరువురుస్త్రీలు—వీరికిని తలమీద పడగ యుండుటచేతవీరును నాగులే కావచ్చు—రెండువైపులనున్న చెట్లకొమ్మలను-కుడివైపున నున్నది ఎడమచేతితోను, ఎడమవైపునున్నది కుడిచేతితోను-పట్టుకొనియున్నారు. వీరిరువురికి పరిచారకులు కలరు. కుడివైపున్న పరిచారిక కుడిచేతితో పూవును, ఎడమచేతితో కొమ్మను పట్టుకొనియున్న స్త్రీ కేదో పాత్రవంటి దందిచ్చుచున్నది. ఈమెకు నెత్తిమీద పడగగలదు. ఎడమవైపునున్న పరిచారకుడు పిడికలిగిన గుండ్రనివస్తువును దేనినో ఎడమవైపుకొమ్మను పట్టుకొని యున్న స్త్రీకందిచ్చుచున్నాడు. ఈస్త్రీ ముందొకయున్నతాసనము కలదు. దానిమీద నామె తనకుడికాలు నానించికొని యున్నది. నాగరాజునకుముందు ఎడమవైపు మువ్వురు నాగకన్యకలు కూర్చుండి యున్నారు. వారు పాటపాడుచుండిరో ఏమో! వీరందఱికి తలమీద పడగ యున్నది. ఈచిత్రముల నన్నిటిని పరిశీలించినచో నాగజాతిస్త్రీకి తలమీద ఒక్కపడగయు, పురుషునికి పెక్కుపడగలు నుండునట్లు తోచును. కూర్చుండిన మువ్వురు నాగజాతిస్త్రీలకు ఎదురుగ కుడివైపున ఒకస్త్రీ నాట్యము చేయుచున్న విధమున నున్నది. ఆమెను వెనుకనుంచి యొక నాగకన్యక పట్టుకొనుచున్నది. ఈమె వెనుక బల్లమీద నేదియో యొక చిన్న పాత్రకలదు. అన్నిటికంటె దిగువభాగమున కమలములు, హంసలు, కలువలు మొదలైనవి కలవు.

ఈచిత్రమునందలి యితివృత్తమేదియో బోధపడుటలేదు. బౌద్ధవాఙ్మయము నింకను బాగుగ జదివినగాని యిట్టి యితివృత్తములు తెలియరావు కాని గాథలుమాత్రము బౌద్ధయుగమునకు సంబంధించినవే యని నిస్సంశయముగ జెప్పవచ్చును.

అమరావతీ స్తూపమున నాగులచిత్రము లనేకములు కలవు. పడగలు లేనివారలు ఏజాతివారో తెలిసికొన సాధ్యముకాదు. బట్టకట్టులోను, జుట్టుకట్టులోను వారును, నాగులు నొక్కరీతినే యున్నారు. వీరందఱు నాగరాజులచే పరిపాలింపబడు వారగుదురేమో. ఈస్తూపచిత్రము లన్నిటిలో నాగులచిత్రములు ప్రధానములుగ గాన్పించుచుండుటచేత నాగులకును అమరావతీ స్తూపమునకును ఎక్కువ సంబంధమున్నట్లు కనబడును. టిబెట్టు బౌద్ధగ్రంథముల ననుసరించి నాగార్జునాచార్యులవారు నాగలోకమునకు వెళ్లిరనియు, అచ్చటినుండియే కొన్నితంత్రములను వేటినో దీసికొని ధాన్యకటకమునకు వచ్చిరనియు ఏవో గ్రంథముల జదివిన జ్ఞాపకము. మహాయాన బౌద్ధముకూడ నొకవిధముగ తాంత్రికమే యని కొందఱందురు. ఏది యెట్లయినను ఈప్రాంతము నాగుల కునికిపట్టని కాని, ధాన్యకటకమునకు నాగులకు నెక్కువ సంబంధ ముండి యుండునని కాని, మహాదేవుని ప్రయత్నముల మూలమున ఈప్రాంతమున బౌద్ధమతము నవలంబించినవారలు ప్రధానముగ నాగులై యుండురనికాని, నాగార్జునాచార్యులవారికిని నాగులకును కలదనుసంబంధమున నేదియో కొంత సత్యముండునని కాని విశ్వసింపవలసి యుండును.

ఇక ఐదవ చిత్రములోని చిత్రమును జూతము. ఒక పడవలో ఏనుగుపైన ఒకరాజు ముందుకూర్చున్నాడు. ఆతనివెనుక నిరువురుస్త్రీలు కూర్చున్నారు. వీరందఱును నదిని-కృష్ణయేమో-దాటుచున్నారు. పడవ ఒడ్డు చేరగనే రాజువెనుక కూర్చున్నవారు క్రిందికి దిగి తమకొఱకు వేచియున్న యిరువురుస్త్రీలను కౌగిలించుకొనుచున్నారు. వేఱొకస్త్రీ రాజునకు నమస్కరించుచున్నది.

పడవకు దిగువభాగమున నొక యాసనమున నొక స్త్రీ కూర్చుండియున్నది. ఈమెకు ఎడమప్రక్క నిరువురు పరిచారిక లున్నారు. అందొకతె ఏదియో తినుట కామె కందిచ్చుచున్నది. రెండవది తన చంకక్రింది కడవలోనుండి ఆమెకు త్రాగ నిచ్చుటకై పానీయము నొక పాత్రలో నైకొనుచున్నది. ఆమెకు కుడిచేతిప్రక్క సంగీత, జంత్రవాద్యకుశలురైన స్త్రీలు కలరు. వారిలో నొకరు పిల్లనగ్రోవి వాయించుచున్నారు. మఱియొకరు 'సితారు'వంటి దానిని దేనినో మీటుచున్నారు. ఈ సంగీతపాటకుల కెదురుగ సింహాసనమున నాసీనులై యిరువురు స్త్రీలు కలరు. ఆరవ పటములోని దానివలెనే ఇందలి యితివృత్తముకూడ తెలియవచ్చుటలేదు. ఇప్పుడుకూడ మనము చిత్రముల సౌందర్యము నుపలక్షించి తనివి నొందవలసిన వారమే.

ఏడు, ఎనిమిది చిత్రములలోని గాథలును మనకు తెలియరానివే. అయినను ఎనిమిదవ చిత్రపటములోనిది నిజమున కొకగాథ కాదు. ఆపటమధ్యమున నొక్కడు బుద్ధుని దగ్ధావశేషము నొక పాత్రయందుంచి దాని నొకపల్లెరమునందిడి, దానిని నెత్తిపై బెట్టికొని యున్నాడు. స్త్రీ పురుషులో, లేక దేవతలును, అప్సరసలునో వలయాకార



చిత్రము ౧౩

వెల స్వల్పము! ఫల మధికము!!

# ప్రతాపకస్తూరిమాత్రలు.




దీనియందు కస్తూరి, గోరోజనం, కుంకుమపుష్పం, పచ్చకర్పూరము మొదలగునవి చేర్చి తయారుచేయబడి నవి. మిక్కిలి ఘాటుగలిగి సువాసనగా నుండును. తాంబూలములో గాని, విడిగా గాని 1-2 మాత్రలను పుచ్చుకొనిన మిక్కిలి రుచికరముగా నుండుటయేగాక అజీర్ణము, వాయువు, జలుబు, జ్వరము, దగ్గు, ఉబ్బ సము, పచ్చిపాతములు మాంద్యములు, చిన్నబిడ్డలకు, కలరా, ప్లేగు, జలకోశము మొదలగు అనేకవ్యాధు లను ఖండించి బలమును, ఆరోగ్యమును కలిగించుటలో అత్యుత్తమమైనవి. బిడ్డలకు యీమాత్రలను అప్పు డప్పుడు వాడుచుండిన వాయువు, అజీర్ణము, చేరనివ్వక చక్కగా పోషించుచుండును అనేక యోగ్య తాపత్రములు గలవు. ఇప్పుడు బజారులో విక్రయింపబడుచుండు నేకరకము మాత్రలుగాక శ్రేష్ఠమైన వనుటచే ప్రతివారును వీటిని తెచ్చుకొని యుపయోగించుచున్నారు. మీరు బజారులలో కొనునప్పుడు ప్రతాప కస్తూరి మాత్రలే కావలయునని కోరుడు. వారివద్ద లేనిచో మాకే వ్రాసిన శ్రేష్ఠమైన మాత్రల సీసాలను ఈ క్రిందిధరల ప్రకారం పంపుదుము, 250 మాత్రలసీసా 1-కి 0—4—0 డజను సీసాలు, 2—8—0, 3 డజనులు (36 సీసాలు) 6—9—0 రు. పోష్టు ఖర్చులు ప్రత్యేకము.

పి. శి. ఏ. అండు కంపెని, ఆయుర్వేద సమాజం, పెరిదేపి, నెల్లూరుజిల్లా.

---

## ఉచితము సంజీవితాయతు

(మంత్రించి అద్భుతమైనక్రియతో తయారుచేయబడినది)

విచిత్రశక్తిగల దీనిని ధరించుకొనిన, గొప్పవారి దయ, కార్య సిద్ధి, ధనలాభము, వ్యాపారవృద్ధి, వ్యాయుష్ఫలములో అనుకూలము, పరీక్షలలో జయము, ఉద్యోగము చేకూరుట, అదృష్టము మొదలైనవి కలుగును. ప్లేగు, కలరా, స్ఫోటకము సోకవు. కష్టములను, గండము లను తొలగించును, ఆరోగ్యము, బలము, తెలివి, అందము నిచ్చును. ఇది అనేకులచే మెప్పుపొందినది. ప్రచురణ పోష్టుఖర్చులకై రూ॥ 1 యు పంపిన సంజీవి తాయతు ఉచితముగా పంపబడును. వి. పి. గా పంపిన 1-8-0 యగును.

## ఇంద్రజాల మహేంద్రజాలము

ఈ గ్రంథములో జర్మనీగారడి, హస్తలాఘవము, ఆంగ్ల ఇంద్రజాలము, మంత్ర శాస్త్రము, ధూర్తవైద్యము, యంత్రములు, చీట్లపేక తమాషాలు, వినోదవిద్యలు, మనుష్యుని మాయముచేయుట, మామిడిచెట్టును పుట్టించుట, జీవముతో సమాధియగుట, శరీరము లేని తలచేత మాట్లాడించుట, గాలిలో మనుష్యుని నిలుపుట మొదలగు విచిత్రములున్నవి. దీనిచే మేజిక్ చేయగలరు. వెల రూ. 4.

ఉపాధ్యాయుల చింతామణి! విద్యార్థుల వరప్రసాదము!

పి. ఆర్. జనార్దనం నాయుడు, ఒంగోలు, (గుంటూరు జిల్లా.)

## చదువతగిన ప్రకటన

| | | రు. | అ. |
|---|---|---|---|
| (1) | ఆదిభక్తవిజయము | 6 | 0 |
| (2) | భగవద్గీత టీకా తాత్పర్యము | 2 | 8 |
| (3) | రామకృష్ణకర్ణామృతము టీ॥ తా॥ ప్రతి 1-కి | 1 | 8 |
| (4) | భాగవతసారము | 1 | 8 |
| (5) | ముకుందమాల | 0 | 12 |
| (6) | హిందూ పురాణకథలు—శంకరవిజయము ప్రతి 1-కి | 0 | 8 |
| (7) | భారతకథలు | 5 | 8 |
| (8) | ఆంధ్రనామసంగ్రహము | 0 | 12 |
| (9) | శంకరనారాయణ నిఘంటు—ఇంగ్లీషుకు తెలుగు | 8 | 0 |
| | డిటో తెలుగుకు ఇంగ్లీషు | 5 | 0 |
| (10) | రామకృష్ణపరమహంస ఉపదేశవాక్యములు | 0 | 12 |
| | డిటో ఇంగ్లీషు పాకెట్ సైజు | 1 | 0 |
| (11) | Macmillan's Eastern Tales English *or* Telugu Edition Each Sort | 3 | 9 |
| (12) | Longman's Indian Reading Book series (English *or* Telugu Edition) Each sort | 3 | 12 |
| (13) | Fountain Pens—Black bird | 3 | 12 |
| | Swan | 6 | 12 |

అడ్వాన్సు బంపని ఆర్డర్లు గమనించబడవు.

యస్. వేంకటరాయలు అండు సన్,
96, తంబుశెట్టి వీధి, మద్రాసు.

## నిగళబద్ధకవి

బొమ్మరాజు జానకిరామశర్మ గారు

(ఆత్మగతము)

కో సుకవి పల్కఁగా “పడుపుఁగూడు” వరాంకితమంచు పోతరా
“కసి”యని రోయుచుఁ హితధరేశులు “గస్తురి” “రోజువచ్చెనుఁ”
విసువక యిచ్చువారుఁ జన నేఁగృతిమానుచు బొడ్డుపల్లిలోఁ
“బెసలుకిలల్” పొలాన వెదపెట్టితి నక్కట! సేద్యగాడనై.

సీ. గౌడడిండిమభట్టు కంచుఢక్కను వోలెఁ బగులఁగొట్టితి నట్టు వడినగడ్డ
సత్కథాబీజముల్ సంతరించినయట్లు విత్తించితిని పంటవిత్తనముల
దీనారటంకాలఁ దీర్థమాడినరీతి మంచెపైనుంటి సస్యముల వానఁ
దెలుఁగురాయండిచ్చు దివ్యకస్తూరినా చేపట్టి ముడిచితి చేనిమొలవు
పూలనమ్మిన యంగడిఁ బుద్ధిలేక, కట్టె లమ్మినరీతిఁ గనకలేఖ
నిఁ వహించిన చేతనే గునపమంది, గట్లు విఱచితి చేతులు కాయఁగాయ.

మ. గరిటోనాకి ప్రతిమ్మనుం కెఱదితిఁ గాకేమి పూనాఁడు భూ
వరులే న్నాడు దరిద్రదేవతను గూల్పన్ జాలకేపోయి శ్రీ
ధరణి న్నమ్మిన “కృష్ణవేణి” కృప యింతేఁ జూపి సర్వస్వముఁ
హరియించెఁ దురదృష్టునిఁ ధనికుఁ జేయఁ శక్యమే యేరికిఁ!

సీ. “ప్రాప్తమా లేశమే పదివే”లనుచు నమ్మి పోతరాజున కిది పోలెగాక
“అకటకటా నిను నమ్మ భారతి” యన్న పోతరాజున కిది పోలె గాక
“నమ్మెట్రవేటుల” నమ్మతింపని మేటి పోతరాజున కిది పోలుఁగాక
“పడుపుగూడు” భుజింపఁ బాలుపడని శుచి పోతరాజున కిది పోలుగాక
గీ. లేకి ధనికుల సభలలో లేచి స్వర్ణ-కింకిణులు మ్రోయఁ గృతికన్యఁ గొంకులేక
మొలమి నర్తింపఁ జేసిన ఖలమతికిని - సాధుకర్షకత విధికి సమ్మతంబె?

శా. లేరా! ముందునుఁ గల్గరా! కృతుల నీలీలన్ ధరాపాలురన్
బేరుంజేర్చి నుతించు సత్కవులుగానీ యొక్క పాత్రమ్ము నేన్
శ్రీరామాంకితమో! శివాంకితమునో చేయంగ వాంఛింతు ర
య్యారే! నే నటువంటి భాగ్యమునకైనా! నోచనైతిన్ గదా!

గీ. మహిపతులు మంత్రిజనులుఁ గోమట్లు శూద్రు-లౌర? వీరని వారని యనఁగ నేల?
“వీథి”నంగడియందున పెట్టి మెల్ల-వారి కమ్మితి పద్యముల్ పాపమనక.

గీ. ఏడునూరుల టంకమ్ము లిచ్చువఱకుఁ-గదలనీయఁడు కంసాలి కరణ మిపుడు
ఆకలికి నోర్వవలెనో! ఘోరావమాన-వహ్ని తాపము నోర్వంగవలెనో, అకట!

మ. గమికర్మీకృతనైకనీవృతుఁడనై గ్రామంబు గ్రామంబు బ
ల్పమునుం గాలికి కట్టి తిర్గితిని తద్గ్రామంబులన్ జారిణీ
రమణీవర్ణన, లోభివర్ణనము నైరాశ్యంబునన్ గూర్చి ప
ద్యములం బాడితిఁగాని వేలుపులు లేరా? పద్య మీఁగూడదా?

గీ. నేలనాలుఁగుచెఱఁగుల నేలినట్టి - పృథ్వీపతులకుఁ జేతిజంబీరమైన
నే నిపుఁడు చేతు లిఱికించి నిగళమందు - కాపుఁ గరణాల సభలోనఁ గట్టుపడితి.

సీ. వీరభద్రారెడ్డి విద్వాంసుఁడగు నేమి! యాంధ్రనైషధకర్త యైన నేమి?
కవిరాజ బిరుదంబుఁ గల్గియుండిన నేమి? సార్వభౌమాభిఖ్య చాలి యేమి?
విన్నవమంత్రికి విందనయిన నేమి భాస్కరుమైత్రిచేఁ బఱఁగ నేమి?
మైలారువిభుని ప్రేమముఁ జూఱఁగొన నేమి? డిండిమభట్టు గెల్చియును నేమి?
గీ. కాపుఁగరణాలఁ బాదరతులను లేచు - రచ్చమిట్టలదుమ్ములో వచ్చువారు
పోవువారును నూఱడింపులను సేయ-బండకొయ్యనుఁ గౌగిటఁ బట్టవలసె.

శా. తల్లీ! శారద! నీకు నావలన మత్కావ్యప్రపంచమ్మునం
దెల్లన్ సుంతయు మేలుకల్గద! రసంతేన్ నీదు పుత్రాళికే
యుల్లాసంబును గల్గలేద! కలదే నీవేళ తద్భాగ్య సం
పల్లాభంబున నేను ముక్తిపదముం బ్రాపింపఁగాఁ జేయవే!

గీ. ప్రభులకీర్తినిఁ దెల్పి నాప్రతిభఁ జూపి-ధరణి నాకావ్య మాచంద్రతారకముగ
నుండునే నింక, నాకు లేకున్న దేమి!-యేను మృతజీవుఁడనె యాంధ్ర(?)విషయమందు.

గీ. శారదోపాసనారసాస్వాదసిద్ధు-లందునే నొకఁడను ప్రళయమునసైన
అభవుఁడ విముక్తమునువలె హరికీర్తి-లోకసుక్షేత్రమునను వెల్గుదును నేను.

మ. కలికోపాహరణంబుఁగా వలుని యాఖ్యానంబు వర్ణించితిన్
విలసత్సూక్తుల కాశిఖండమునకున్ విజ్ఞాలి మెప్పించితిన్
పలుకన్ నేర్చితి చక్రవర్తులను శైవక్షేత్రసంపత్తినిన్
బలుకుం దోడయి వాణి రా దిరిగితిన్ భాషాప్రపంచమ్మునన్

మ. కనియుం బెంచియుఁ బెద్దఁజేసి చనిరేకా నన్నయాదుల్ మహా
ఘను లావేళను దిక్కులేని నిను వేడ్కం జేరఁగాడిసి పా

వన రీతుల్ గను లుల్లసిల్ల నృపసంభావ్యస్థితిం గూర్చినా
వని విశ్వాసమెయున్న నీకు దయరాదా! నాపయిన్ భారతీ!

'ఆంధ్రవాణి'

గీ. తనయ! నీసేవ నేనింత దాసనైతి-ఖండఖండాంతరములఁ బేర్గాంచినాను
పరమ పుణ్యుఁడ వీవు నీ భవ్యకీర్తి - శాశ్వతము శాశ్వతమ్మును శాశ్వతమ్ము.

గీ. సకల కర్ణాటరాజులు మకుటరత్న-కాంతి నీపదములకెపఁ గాన్క పెట్టి
రదియు నాకుఁ బ్రతిష్ఠగ నాత్మఁదలతు-అపగతవిభేదనై "త్వమేవాహ" మనుచు.

ఉ. పంకజగర్భదేవు తలవాకిట నెన్నిదినాలు నేను ని
శ్శంకముగాఁ జరింతునో లసద్గతి నంతటిదాక నీవు మ
త్కింకరభావమొప్ప నవకీర్తికిరీటముతోఁ బునర్ణవ
స్సంకటముల్ దొలంగగఁ బ్రచారముసేయుము భావవీథులన్.

క. అన్నన్న? నీకు భవనము క - దున్నదె? నీ చేతిభిత్తి యుర్వినిఁ గల "పి
డ్డన్న" మొదలుకొని గల దద్దన్న కవులవలనఁ బ్రస్తుతం బాంధ్రమునన్.

శా. నీసంబైనను నీదుచేయి దగులన్ శృంగారభూషానము
ల్లాసాపాదకహా సువర్ణమగుచున్ లాలిత్యముంగాంచఁ బె
ల్లాసం బొందియుఁ బక్వతోహరులునై యాంధ్రావనిన్ సత్కవుల్
నీసంబైనను సంగ్రహింప కిటులన్ నీకంగలారో! కవీ?

(అని యదృశ్య యగును.)

---

## ఈశ్వరా!

సోమంచి సూర్యనారాయణశర్మ గారు

ఇంచుక యాయువద్ది హరియింప జరాయుజజాలనొక్కచో
మించి యతింపుచుండు నటు మిత్తి గుటుక్కున గుక్క వేయగా
బొంచియు నుండు వెంట నిది బుద్ధి నెఱింగియు బామరుండు ని
శ్చంచలవృత్తి నీయెడల సల్పడు భక్తి నిసీ! మహేశ్వరా!

మంచితనంబు ధూర్తమతి బట్టుటకున్ కెడుదారినుండి మ
ళ్లించుట కెట్లు చాలునో హరీ హరి! యెన్నడు దొంగవాకిటన్

మంచము వేయు మందురు క్రమంబునఁ బెద్దలు సుద్దు లందుకుఁ
గొంచెడివారి కేమిగతి గూర్చినవాఁడ వహో! మహేశ్వరా!

చంచల మీ సమస్తము ససారము సంసరణం బటంచు గు
ప్పించు విరాగవాక్యముల వేయివిధంబుల మాత్మహాత్యకే
గొంచను పైడి గూడ గను గొంచెము పీ ల్గనుపెంచినఁ ద్రుణ
భ్యంచితరూప మట్టి ఘనవంచకు బారికి దప్పి యెల్లొ వ
ర్తించు వివేకి దారి గణుతింపగఁబోల దటో మహేశ్వరా!

సంచులకొద్ది విత్తమును జాతురిమై గడియింపనీ, మహా
వంచకబుద్ధి భూములఁ ససారముగా గొని యాక్రమింపనీ,
క్రించుల గూడి సంఘమును గ్రిందును మీదును జేయనీ, నుతుల్
గాంచి రహింపనీ, దొరలె గౌరవనీయు డటంచు మ్రొక్కనీ,
ఇంచుక లేక నీకరుణ యెట్లు తరించునయా, మహేశ్వరా

పంచి భుజించు టే సుజనపద్ధతి కొంచియుమైన; దవ్వ యో
జించి యొనర్చినట్టిదియె చిక్కని చక్కని కార్య; మెందు లా
లించి యొసంగునట్టిదియె యింపవు బోనము; నీదులీల వ
ర్ణించెడి జాలె కైత; యిది నిత్యము సత్యమురా, మహేశ్వరా!

---

## శ్రుతి లేని

అడివి బాపిరాజు గారు, బి. ఏ.

పాడకే నారాణి
పాడకే పాట,
పాటమాధుర్యాల ప్రాణాలు మరిగెనే,
పాడకే నారాణి పాడకే పాట.

రాగ మాలాపించి
వాగులా ప్రవహించి,
సుడితిరుగు గీతాల సురిగిపోనీయకే,
పాడకే నారాణి పాడకే పాట.

కరవీర కోరకాల్
కదలి నీ పెదవులే
ప్రణయపద మంత్రాల బంధించె జీవనమ
పాడకే నారాణి పాడకే పాట

శ్రుతిలేని నాహృదికి
చతురగీతం బేల?
గతిరాని పాదాల కతుల నర్తనమేటి?
పాడకే నారాణి పాడకే పాట

---

